కొత్తపల్లి - తెలుగుపిల్లల ఈ (e) మాసపత్రిక    అక్టోబరు 2011

**మూలం: http://kottapalli.in/2011/10/welcome**

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం (మహాత్ములు):** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

మహాత్ములు...సంపాదకీయం...2

**ధారావాహిక**

నీతి చంద్రిక...కందుకూరి వీరేశలింగం...4

**పిల్లలు రాసిన కథలు**

గొప్పకు పోతే...యోగి...11

వేలెడంత పిలగాడు...రాజు...15

నేను సాధించాను...సాయి అజయ్...21

పొరుగింటి చీర...తరుణి స్ఫూర్తి...24

మూడు ముచ్చట్లు...చరిత గంగి...26

పని-పాట...గౌరీప్రియ...30

మాట తీరు...అనిత...33

కొత్తపల్లికో కథ...గీతిక...36

**కార్టూన్ కథలు**

పేరు వచ్చాక ఏమయింది?...అనురాగ్...40

మంచిపని...అడవి...55

**పెద్దలు రాసిన కథలు**

సహాయం...మహానందప్ప...45

రాజు-మాంత్రికుడు...రాధ...49

**అవీ-ఇవీ**

బొమ్మకు కథ రాయండి...లలిత...41

కల(స్పందన)... గంగమ్మ...42

చిలిపి ప్రశ్నలు...మూర్తి...54

విలియం కంక్వంబా...సౌమ్య...56

సమీక్ష...మాలతీకృష్ణ...59

పదరంగం-8...దేవి...61

**పాటలు**

చీమ పాట...జైసీతారాం...62

నగరానికి దూరంగా...కుమారస్వామి...63

# మహాత్ములు

మనం చిన్నప్పుడు ఎట్లా ఉంటామో పెద్దయ్యాకకూడా అట్లాగే ఉంటామని లేదు.

చిన్నప్పుడు పీలగా, సన్నగా, బక్కగా, పాలిపోయి ఉండే పిల్లవాడు- పెద్దయ్యాక వాళ్ళ నాన్నంత బొర్రపెట్టుకొని, గుండ్రంగా అవ్వొచ్చు.

చిన్నప్పుడు చీమిడి ముక్కుతో, పీక్కుపోయిన ముఖంతో, మూగమొద్దులాగా కనిపించిన పాప పెద్దయ్యాక వాళ్ళ అమ్మలాగా అందంగా, బొద్దుగా, గలగలా మాట్లాడుతూ రేడియో యాంకర్ పని చేయచ్చు.

చిన్నప్పుడు 'రాముడు మంచిబాలుడు' అనిపించుకున్న రాముళ్ళు, పెద్దయ్యేసరికి తుంటరిగాళ్ళు కావొచ్చు; అట్లాగే చిన్నప్పుడు అల్లరి పనులు చేసి కూడా, పెద్దయ్యే క్రమంలో ఆ తప్పులన్నిటినీ దిద్దుకొని ఆ అల్లరి పిల్లలే మహాత్ములు అయిపోవచ్చు.

చిన్నప్పుడు ఒక్కో పరీక్షలోనూ అతిగా కంగారు పడిపోయి, ఏదేదో రాసేసి, సున్నా మార్కులు తెచ్చుకొని, ఫెయిలయి, తిట్లు తిని, ముఖం ముడుచుకొని, ఆ తర్వాత పెద్ద అయ్యాక గొప్ప శాస్త్రవేత్తలు అయిన వాళ్ళున్నారు.

చిన్నప్పుడు బాగా చదువుకొని, ఆ తర్వాత దురలవాట్లకు లోనై, వాటి చక్రవ్యూహంలోంచి బయటపడటం రాక, వాటిలోనే కూరుకుపోయిన అభినవ అభిమన్యులూ ఉన్నారు.

చిన్నప్పుడు ఏదో ఒక మోస్తరుగా ఆడుకొని, పెద్దయినాక గొప్ప కోచ్ లుగా ఎదిగిన ఆటగాళ్ళున్నారు. చిన్నప్పుడు బళ్ళు, కాలేజీలు ఎగగొట్టి తిరిగి, పెద్దయినాక గొప్ప విశ్వవిద్యాలయాల్లో ప్రొఫెసర్లయిన వాళ్ళున్నారు. పదో తరగతి తప్పి, ఆపైన ఏదోఒక పని చేసుకుంటూ గణితశాస్త్రంలో మేధావులకుకూడా అర్థంకాని సమస్యలకు పరిష్కారం సూచించిన

రామానుజన్‌లు ఉన్నారు. చిన్నప్పుడు గోడలకు రంగు వేసుకుంటూ తిరిగి, పెద్దయినాక అద్భుతమైన రచనలు చేసి ఖ్యాతి గడించిన వాళ్ళున్నారు.

చిన్నప్పుడు దొంగపనులు చేసి, అటుపైన అందులోని తప్పును గుర్తించి, పశ్చాత్తాపపడి, వాటిని వదిలేసి, పెద్దయినాక నీతికి, సత్యానికి, శాంతికి ప్రతీకలుగా నిల్చిన బాపూజీలూ ఉన్నారు.



ప్రపంచంలో అన్నింటా మార్పులు వస్తూనే ఉన్నాయి. ప్రతిక్షణమూ మార్పు సంభవిస్తూనే ఉన్నది. అయితే, "మనం ఎటువైపునుండి ఎటువైపుకు మార్పు చెందుతాం" అన్నది నిజానికి మన చేతుల్లోనే ఉన్నది- అజ్ఞానం నుండి జ్ఞానంలోకి, అవిద్య నుండి విద్యలోకి, అశాంతినుండి శాంతిలోకి, ద్వేషంనుండి ప్రేమలోకి చేర్చే మార్పులు ఊరికే రావు: వాటికోసం మనం కొంచెంగానైనా సరే, ప్రయత్నించాల్సి ఉంటుంది.

అలా ప్రయత్నిస్తున్నవాళ్లంతా మహాత్ములౌతారు, ఏదో ఒక నాటికి.

మిగిలినవాళ్ళందరికీ మార్గదర్శకులౌతారు వాళ్ళు.

అందరికీ గాంధీ జయంతి శుభాకాంక్షలు.

కొత్తపల్లి బృందం. 

మీ కలాల్ని, గళాల్ని, మీలోని కళల్ని పది మందితో ఉదారంగా పంచుకోండి.
పంచినకొద్దీ మీలోని కళ మరింత వికసిస్తుంది!



# నీతి చంద్రిక

విగ్రహం-1

*మిత్రలాభం, మిత్రభేదం ముగించిన విష్ణుశర్మ ఇప్పుడు విగ్రహాన్ని మొదలు పెడుతున్నాడు.. చదవండి నీతిచంద్రిక-24 వ భాగం...*

*మూలం: కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ.*

రాజకుమారులు నలుగురి హృదయాలూ అమితమైన సంతోషంతో చివుర్లు తొడిగాయి. వికసించిన పద్మాల్లాంటి మనస్సులతో వాళ్ళు నలుగురూ విష్ణుశర్మ చుట్టూ చేరి, "స్వామీ! మీ సేవ చేసిన భాగ్యం వల్లనే మేం మిత్రభేదాన్ని వినగలిగాం. మా మనసులకు ఎంతో సంతోషం కలిగింది. ఇక 'విగ్రహం' కూడా తెలియజెప్పి, మమ్మల్ని కృతార్థుల్ని చేయండి. దయచేసి ఆ కొత్త కథల అమృతధారల్ని త్వరగా కురిపించండి. ఆకలిగొన్న మా చెవులకు కథల విందు చేయండి" అన్నారు.

విష్ణుశర్మ వాళ్ళ మాటలకు సంతోషించి, పంచతంత్రంలోని మూడవ భాగమైన 'విగ్రహాన్ని', ఆదరం కొద్దీ చెప్పటం మొదలుపెట్టాడు:

"సమానమైన బలమూ, పరాక్రమమూ గల

ఒక నెమలికి, హంసకు పోట్లాట మొదలైంది ఒకసారి. చిలికి చిలికి గాలి వాన అయినట్లు, వాటి పోట్లాట చివరికి యుద్ధంగా పరిణమించింది. ఆ సమయంలో ఒక కాకిని నమ్మిన హంస, చివరికి ఓటమి పాలైంది. మీకు ఆ కథ చెబుతాను, చక్కగా వినండి:

కర్పూర ద్వీపంలో పద్మకేళి అనే కొలను ఒకటి ఉండేది. అందులో హిరణ్యగర్భుడు అనే హంస నివసిస్తూ ఉండేది. ఆ కొలను చుట్టూ నివసించే నీటి పక్షులు ఆ హంసను తమ రాజుగా చేసుకొని సంతోషంగా కాలం గడిపేవి. ఆ హంసరాజు దిక్కులన్నిటినీ జయించి, అన్ని వైపులా తన తేజస్సు ప్రకాశించగా, ఒకనాడు ప్రొద్దున సూర్యుడు ఉదయించిన తర్వాత, తనకు ఇష్టమైనవాళ్ళు, పండితులు, అందరూ తన చుట్టూ చేరగా, రాజఠీవితో సింహాసనం మీద సుఖంగా కూర్చొని కొలువుదీరింది.

ఆ సమయంలో 'దీర్ఘముఖుడు'అనే కొంగ ఒకటి వాకిట నిలచి, ద్వారపాలకుల ద్వారా తన రాకను తెలియపరచింది. ఆ కొంగ అంతకు ముందు చాలా నెలల క్రితం విదేశాలకు వెళ్ళి తిరిగివచ్చిన చెలికాడే; కనుక హిరణ్యగర్భుడు దాన్ని సాదరంగా లోనికి ఆహ్వానించింది.



దీర్ఘముఖుడు అప్పుడు తగిన రీతిగా సభను చేరి, వినయంతో వంగి నమస్కరించి, గౌరవంగా నిలబడ్డది. రాజుగారు ఆదరంతోటీ, సంతోషంతోటీ ఆ కొంగను చూస్తూ "రా, కూర్చో" అని చెయ్యి చూపి, తనకు దగ్గరగా కూర్చుండబెట్టుకున్నది.

"ఓయీ! దీర్ఘముఖా! కులాసాగా ఉన్నావా? చాలాకాలానికి నిన్ను ఇలా చూడగల్గుతున్నాం. విదేశాలలో నివసించటంలో నువ్వు చాలా అలసిపోయినట్లున్నావు- బాగా చిక్కి-పోయావు కూడాను. ఇంతకాలమూ ఏ ఏ

దేశాలు తిరుగుతూ ఉన్నావు? ఏ ఏ ప్రాంతాల్లో ఏలాంటి విచిత్రాలు కనబడ్డాయి, నీకు? మంచి దృశ్యాలేమైనా నీ కనులకు పండగ చేశాయా? నీ ముఖం విప్పారటం చూస్తుంటే ఎక్కడో , ముఖ్యమైనదే ఏదో నీకంట పడినట్లు తోస్తున్నది. నువ్వు వెళ్ళినచోట్ల వింతలు విశేషాలకు ఏమి కొదవ? త్వరగా చెప్పరాదూ, అందరం వింటాం!" అన్నది.

అప్పుడాకొంగ "అయ్యా! తమరి పరిపాలనలో ఉన్న భూభాగంలో ఏమూల చూసినా కుశలము, క్షేమం తప్పకుండా ఉంటాయంటే, ఇక ఎల్లకాలమూ దేవరవారి పాదాలను ఆశ్రయించుకొని, తమ ఆస్థానంలో మెలిగేవాళ్ళం- మమ్మల్ని 'క్షేమమా' అని వేరుగా అడగవలసిన పని ఏమున్నది? ఇక దేశాంతరాలలో ఉన్నప్పటి సుఖం సంగతంటారా, అది కుందేటికొమ్ము లాంటిది. దాని సంగతి తమరు నా శరీర కాంతిని చూడగానే గ్రహించారు. అదంతా అటుండనివ్వండి- ఏమంత విశేషం కాదది-

ఆ రోజున తమరి పాదాల ఆదేశాన్ని అనుసరించి వెళ్ళినది మొదలు, 'ఈ, ఆ దేశమ'ని ఏం చెప్పేది, అన్నిచోట్లూ తిరిగి తిరిగి, ఎలాగో వెనక్కి తిరిగివచ్చి, నా భాగ్యం కొద్దీ తమకు ఎదురుగా ఇలా నిలబడ్డాను. ఈ మధ్యకాలంలో నేను అక్కడా అక్కడా చూసిన వింతలు లెక్కలేనన్ని ఉన్నాయి- వాటిని అన్నిటినీ విన్నవించాలంటే అనేక సంవత్సరాలు చాలవు. నిలకడ మీద తమకు ఒక్కటొక్కటిగా విన్నవించుకుంటాను-

అయితే తిరిగి వస్తూ వస్తూ తమరి ఈ సేవకుడు ఒక అపరాధం కావించాడు: ఒక్క నిముషంలో నా ప్రయాణపు బడాలిక తీర్చుకొని, అసలు ఏం జరిగిందో వివరంగా చెబుతాను. ప్రభువులవారు తమ దివ్య చిత్తంతో శ్రద్ధగా అవధరించగలరు" అని కళ్ళు సగం మూసుకొని, వేడి నిట్టూర్పులు వదిలి, క్షణంపాటు ఊరకనే ఉండి, మెల్లగా ఇలా చెప్పసాగింది.

"జంబూ ద్వీపంలో 'వింధ్యం' అనే పర్వతం ఒకటి ఉన్నది. ఆ కొండ పైభాగంలో నివసిస్తుంటాడు, చిత్రవర్ణుడు అనే

నెమలిరాజు. అక్కడి పక్షిజాతులన్నిటికీ ఆయనే ఆరాధ్యదైవం.

నేను అనేకయోజనాలు ప్రయాణించి, అలసి, ఆ పర్వత సమీపంలోని అడవిలోకి ప్రవేశించగానే, ఆయన అనుచరులైన పక్షులు కొన్ని నన్ను చూసి నా దగ్గరికి వచ్చాయి. అతిథులకు చేసే మర్యాదలన్నిటినీ చేసి అవి నాకు అమృతంతో సమానమైన రుచిగల పళ్లను తెచ్చిపెట్టాయి.



వాటి ఆతిథ్యాన్ని స్వీకరించి, పండ్లుతిని, విశ్రాంతిగా కూర్చున్న నాతో అవి మర్యాద పురస్సరంగా మాట్లాడుతూ, "ఓ కొంగరాజా! మీ పుట్టుకవల్ల తరించి, ఖ్యాతినొందిన ఆ దేశం ఏది? ఏ ఏ దేశాలను విచార సముద్రంలో వదిలిపెట్టి వచ్చి, తమరు ఈ దేశాన్ని పావనం చేస్తున్నారు? ఇటుపైన ఏ ఏ దేశాలు తమరి పాదస్పర్శవల్ల పునీతం కానున్నాయి? ధర్మం తప్పకుండా మీ దేశాన్ని ఏలుతూ, మీవంటి శుచిమంతులను సేవకులుగా పొందిన భాగ్యశాలియై, మీ రాజ్యాన్ని అలంకరిస్తున్న ఆ రాజ రత్నం ఎవ్వరు? మీ కథనాన్ని వినాలని మా అందరి చెవులూ కుతూహలపడుతూ, వేచి ఉన్నాయి. మీ ప్రయాణపు తొందరను ఒక్కింత తగ్గించగలిగితే, ఒక నిముషంపాటు ఇక్కడ ఆగి, మీ కథను ఆసాంతంగా మా చెవులకు ప్రసాదించండి" అని.

అప్పుడు నేను వాటితో ఇలా చెప్పాను: "కర్పూర ద్వీపం" అన్నపేరు గతంలో వినే ఉంటారు గదా?! ఆ ద్వీపానికి ప్రభువు, హిరణ్యగర్భుడు అనే హంసరాజు. నేను ఆ ప్రభువుకు అనుంగు అనుచరుడిని. మా రాజుగారి బల పరాక్రమాలను గురించిన కథలు అనేకం చిన్న పిల్లలకు కూడా పరిచయమే- కనుక ఆయన పేరుతో మీకందరికీ ఈ సరికే పరిచయం ఉండి ఉండవచ్చు. అందరూ

నన్ను 'దీర్ఘముఖుడు' అంటారు. ఆ హంసరాజు నన్ను ప్రాణంకంటే మిన్నగా గౌరవిస్తుంటే, ఆయనకు అంతరంగికుడుగా అనేక సంవత్సరాలు గడిపాను. ఒక నాడు ఈ ప్రపంచంలోని అంతులేని విషయాల్లో గల విశేషాలను, వింతలను చూడాలని నాకు కోరిక కలిగింది. మా ప్రభువు అనుమతి తీసుకొని, మాదేశాన్ని వదిలి, ఎండనక, వాననక దేశాలుకాని దేశాలు అన్నింటినీ సందర్శిస్తూ, వాటిలోని విశేషాలు నా మనస్సుకు సంతోషం కలిగిస్తుంటే, వచ్చి వచ్చి అదేపనిగా ఈనాడు ఈ దీవిలోకి ప్రవేశించాను. ఇక్కడి వింతలన్నిటినీ చూడాలని నా మనసు ఉవ్విళ్ళూరుతున్నది. పక్షివరులారా! ఈ రోజంతా మీతోబాటు మీ దీవిలోని వింతలు-విశేషాలను అన్నింటినీ చూసి కాలక్షేపం చేస్తాను. ఈ రాత్రికి కూడా మీతో ముచ్చట్లు పెట్టుకొని, రేపు ఉదయాన్నే బయలుదేరి మా దేశానికి వెళ్తాను" అని.

అప్పుడా పక్షులు సంతోషపడి, "సరే, అట్లాగే కానివ్వ"మని, కొంచెం విశ్రాంతి తీసుకున్నాక నన్ను తమ వెంట తీసుకొని పోయి, ఆ ద్వీపంలో చూడగదిన ప్రదేశాలనన్నిటినీ నాకు చక్కగా చూపించాయి.



ఆ తర్వాత నన్ను మళ్ళీ తాము ఉండే చోటుకు తీసుకు వచ్చి, నన్ను అక్కడనే దూరంగా ఒకచోట నిలిపి, లోపల విశ్రాంతి తీసుకుంటున్న తమ రాజును చూపించాయి. అటు తర్వాత అవి "ఓ పక్షివర్యా! మీ భూమిని, మా భూమిని- రెండింటినీ బాగా చూశారు కదా! ఈ దేశాలు రెండింటిలోను మీ కంటికి ఇంపుగాను, సొంపుగాను ఏది అనిపించింది? మన రాజులు ఇద్దరిలోనూ ఎవ్వరు గొప్పగా తోచారు? సొంతవారి పట్ల అభిమానాన్ని, 'మేం ఏమనుకుంటామో' అన్న అనుమానాన్ని- రెండింటినీ ప్రక్కన పెట్టి, నీ

మనసుకు వాస్తవంగా ఏం తోచిందో చెప్పు" అని అడిగాయి. అప్పుడు నేను చిరునవ్వుతో ఇలా బదులిచ్చాను:

"మిత్రులారా! మీరంతా బావిలోని తాబేళ్ళమాదిరి, ఎప్పుడూ ఇక్కడే నివసిస్తూ ఉండటం మూలాన, ఇతర దేశాలలోని సంగతులు మీకు కలలో కూడా తెలియటం లేదు. అందువల్లనే మీ మాటలు ఇలా ఉన్నాయి తప్ప, వేరే కారణం ఏమీ లేదు. మీ మనసుల్లో ఉన్న అనుమానాలన్నిటినీ తీర్చుకోవటంకోసం చాలా ఆత్రంగా అడుగుతున్నారు కనుక, మన మధ్య కలిగిన స్నేహాన్ని పురస్కరించుకొని, ఉన్నది ఉన్నట్లు చెబుతాను, వినండి:

నిజంగా మా దేశానికి, మీదీవికి ఏనుగుకు-దోమకు ఉన్నంత వ్యత్యాసం ఉన్నది. మా రాజ్యం ఎవ్వరినైనా ముగ్ధుల్ని చేసేంత సుందర ప్రదేశం; నివాస యోగ్యమైన ప్రాంతం. దానితో పోలిస్తే మీ నివాసం నిజంగా మహారణ్యమే. ఇక రాజుల్ని చూస్తే, మా రాజుకు- మీ ప్రభువుకు పర్వతానికి-పరమాణువుకు ఉన్నంత తేడా ఉన్నది. మా రాజుకు నివాసం పద్మాలకు ఆలవాలమైన సరస్సు. ఆహారం నిజంగా అమృతమే. ఆయన అనుచరులమైన మేమందరమూ ఎల్లప్పుడు సరసుల సరసన ఉండే కవివరేణ్యులమే. మా ప్రభువు వైభవాన్ని సంపూర్ణంగా వర్ణించాలంటే వెయ్యినోళ్ళవాడికే చేతకాదంటే, ఇక మావంటివాళ్లం ఏం చెప్పగలం?

చూడగా మీరాజు పరిస్థితి దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నది. మీ రాజు నివసించేది ఘోరమైన అడవి మధ్యలో. ఇక తినేది ఏంటా అని చూస్తే కాయలు, గడ్డలు! ఇక సేవకులు ఎటువంటివాళ్ళు? ఎల్లప్పుడూ మూర్ఖులతోటి తిరిగే పలుగాకిమూకలు. ముంజేతికి పెట్టుకున్న కంకణాన్ని చూసేందుకు అద్దం అవసరం ఏమున్నది? ఇలాంటి మీ ప్రభువు వైభవం ఎలాంటిదో మీ మనసులకేస్పష్టం.

అది అట్లా ఉంచండి. మీరంతా ఈ నెమలి పంచన చేరి చెట్లలోనూ, పుట్టలలోనూ

తిరుగుతూ పరితపించవలసిన అవసరం ఏమున్నది? కాయగసుర్లు ఏరుకొని తిని బ్రతకవలసిన ఖర్మ ఏం వచ్చింది? మిమ్మల్ని చూసినప్పటినుండీ నాకు ఇదే విచారంగా ఉన్నది. ఏం చేయాలి? ఇదంతా మిమ్మల్ని ఈ విధంగా పుట్టించిన ఆ దేవుడి తప్పుగాని, మీ తప్పు కాదు.



కేవలం ఒక్కసారి మాట్లాడినంత మాత్రాన, మంచివాళ్ళు స్నేహం కలుపుకుంటారు. ఆ విధంగా మీరంతా నాకు ఇప్పుడు ఆప్తమిత్రులు అయిపోయారు. సత్పురుషులు పరాయి వాళ్ల కష్టాలను చూసి కూడా తట్టుకోలేరట; ఇక ఆప్తమిత్రుల కష్టాలను ఎలా సహిస్తారు? ఈ శరీరం ఉన్నది ఇతరులకు సాయం చేసేందుకే- గనుక స్నేహంకొద్దీ మీకొక మంచి సలహా ఇస్తాను- నా మాటల్ని తీసి పారేయకండి- కొంచెం చెవుల్లో వేసుకోండి. తెలివిగలవాళ్ళు; మీకు ఎక్కువ చెప్పనక్కరలేదు. బాగుపడాలనుకుంటే, ఇక ఎక్కువ ఆలోచించకండి; వెంటనే ప్రయాణమై, రేపు ప్రొద్దునే బయలుదేరి, నాతోబాటు మా దేశానికి రండి. అక్కడ మీకు "ఇంకా ఇది కావాలి" అనిపించని విధంగా, అన్ని వసతులతోటీ కూడిన జీవితం లభిస్తుంది.

మా రాజుకూడా చాలా గొప్పవాడు; ఎంతటి వారిచేతనైనా గౌరవాన్ని అందుకునేంత ఉదారుడు; చాలా దయగలవాడు; ఆశ్రయించినవాళ్లను రక్షించేవాడు- మిమ్మల్నందరినీ తన ప్రజలుగా తప్పక ఆదరిస్తాడు. ఆయనను ఆశ్రయించు-కున్నారంటే, మీరు మీకు నచ్చినట్లు హాయిగా కాలం గడపవచ్చు అక్కడ. కాదనకుండా దీనికి అంగీకరించండి. వేరే ఆలోచనలు మాని, ప్రయాణమై రండి. ఆడుతూ పాడుతూ పోదాం" అన్నాను. ✿

(తర్వాత ఏం జరిగిందో మళ్ళీ చూద్దాం...)




# గొప్పకు పోతే..



*మనందరం గొప్పకు పోతుంటాం, ఎప్పుడో ఒకప్పుడు. అయితే చాలాసార్లు ఆ తత్వం మనకి నష్టాన్నే తెచ్చిపెడుతుంటుంది. గొప్పకు పోయిన మిత్రులిద్దరి కథ చెబుతున్నాడు యోగి. చదవండి..*

*రచన: ఈ.యోగేశ్వరరెడ్డి, 9 వ తరగతి, అరవింద హైస్కూలు, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

అనగనగా ఒక నగరం. ఆ నగరం పేరు 'లక్ష్మీకోటి'. అందులో ఇద్దరు ధనవంతులు నివసిస్తూ ఉండేవాళ్ళు. వాళ్ళు చిన్నతనం నుండి స్నేహితులే. వాళ్ళ పేర్లు ' కోటయ్య, రఘురామ్'. వాళ్ళిద్దరికీ చెల్లెళ్లు ఉన్నారు. రఘురామ్ చెల్లి భానుని కోటయ్య పెళ్ళి చేసుకున్నాడు. కోటయ్య చెల్లి సిరిని రఘురామ్ పెళ్ళి చేసుకున్నాడు. అట్లా మిత్రులిద్దరి కుటుంబాలకూ బంధుత్వం కూడా ఏర్పడింది.

కోటయ్యకు ఇద్దరు పిల్లలు- గిరిజ, రాము. రఘురామ్‌కూ ఇద్దరు పిల్లలే- పార్వతి, విష్ణు. మిత్రులిద్దరిలాగే వాళ్ళ కుటుంబాలూ చక్కగా కలసి మెలసి ఉండేవి. కాలం గడిచింది-

పిల్లలంతా పెద్దయ్యారు.

రఘురామ్ తన కూతురు పార్వతిని 'శివ' అనే అబ్బాయికి ఇచ్చి ఘనంగా పెళ్ళి చేశాడు. పెళ్ళి ఎంత గొప్పగా చేయించాడంటే, నగరం మొత్తం మీద అంత గొప్పగా వివాహం జరిపించినవాళ్ళు ఎవ్వరూ లేరు! నగర జనాభాలో సగం మంది హాజరయ్యారు ఆ పెళ్ళికి! అందరూ ఆ విందు గురించి, అతిథి మర్యాదల గురించి, రఘురామ్ బిడ్డ పెళ్ళి గురించే మాట్లాడుకుంటున్నారు. పెళ్ళి తర్వాత రఘురామ్ ఎక్కడలేని సారెలూ పెట్టి బిడ్డను అత్తవారింటికి సాగనంపాడు. అటుపైన నగరంలో అందరూ ఆ సారె గురించే చెప్పుకోవటం మొదలుపెట్టారు. ఎక్కడ చూసినా కోటయ్యకు రఘురామ్‌ను గురించిన పొగడ్తలే వినబడ్డాయి.

కోటయ్య ఆ మాటలు వినీ వినీ విసిగిపోయాడు. 'ఎలాగైనా రఘురామ్ కంటే చాలా గొప్పగా మా బిడ్డ పెళ్ళి చేస్తాను, ఊర్లో వాడికంటే మంచి పేరు తెచ్చుకుంటాను' అనుకున్నాడు. ఒక నెల తిరిగేలోగా కోటయ్య కూతురు గిరిజకి 'ఆనంద్' అనే అబ్బాయితో వైభవంగా వివాహం జరిగింది. ఈ పెళ్ళికి నగర జనాభా మొత్తం విచ్చేసింది. అంతకు మునుపు రఘురామ్ జరిపిన పెళ్ళి కంటే ఇది ఘనంగా ఉందని అందరూ చెప్పుకున్నారు. వచ్చిన అతిథులని రఘురామ్ మామూలు గదులలో ఉంచితే, కోటయ్య ఏ.సి.గదులలో ఉంచి మరిన్ని సౌకర్యాలు కల్పించాడు! ఇక ఆనాటినుండీ రఘురామ్ మరుగున పడ్డాడు. అందరూ కోటయ్యను పొగడటం మొదలు పెట్టారు.

ఇది విని రఘురామ్‌కి తిక్క రేగింది. "అందరూ నన్ను మర్చిపోవటమేమిటి? నాకేం తక్కువైంది? వాడికంటే నేనే గొప్పవాడిని ! ఇప్పుడు చూడు, మా అబ్బాయి పెళ్ళి ఎలా చేస్తానో!" అనుకొని తన కొడుకు పెళ్ళి ఇంకా ఘనంగా చేశాడు. బయటి ఊళ్ళనుంచి కూడా అతిథులను ఆహ్వానించాడు పెళ్లికి . అందరూ రఘురామ్‌ని పొగిడారు.

వెంటనే కోటయ్య కూడా, కొడుకు పెళ్ళిని- ఇంకా ఘనంగా చేశాడు!

ఇక వాళ్ళ మధ్య గొడవలు రచ్చకెక్కాయి. "నేనా-వాడా" అన్నారు ఇద్దరూ, ఎవరికి వాళ్ళు. రెండు కుటుంబాలూ విడిపోయాయి. అన్నేళ్ళ స్నేహమూ ఒక్క సంవత్సరంలో మాసిపోయింది. ఇప్పుడు ఊళ్ళోవాళ్ళందరికీ అదే చర్చనీయాంశం అయిపోయింది.

ఒక రోజున కోటయ్య ఒంటరిగా ఇంట్లో కూర్చొని ఉండగా కొడుకు వచ్చి "నాన్నా! ఒక సారి డబ్బుల పెట్టె తాళాలు ఇటివ్వండి- ఒక పదివేల రూపాయలు కావాలి. పెళ్ళి అయిన సందర్భంగా మా స్నేహితులకి పార్టీ ఇస్తాను" అన్నాడు. కోటయ్య "సరే నాయనా తీసుకో" అని తాళాలు చేతికివ్వగానే వాడు అదేపనిగా డబ్బుల పెట్టె మొత్తం ఖాళీ చేసేసుకొని పోయాడు. అదేరోజున రఘురాం కొడుకు కూడా "పదివేలు కావాలి" అని అడిగి, లాకర్ మొత్తం గుల్ల చేసేశాడు. విషయం తెలిశాక కోటయ్య, రఘురామ్ ఇద్దరూ గొల్లుమన్నారు. "ఏదిరా?" అని అడిగేందుకు కూడా కొడుకులు ఇంటికి రాలేదు మరి!

అంతులేని దు:ఖంతో మిత్రులిద్దరూ ఎవరికి వాళ్ళు ఒంటరిగా రెండు రోజులు గడిపారు. విషయం తెలిసిన ఊళ్ళో జనాలు "ఇప్పుడు ముసలోళ్ళిద్దరూ ఎట్లా బతుకుతారో చూడాలి. కొడుకులే దగా చేశారు, పాపం! " అని వంతుల వారీగా వెళ్ళి ఓదార్చి రావటం మొదలుపెట్టారు. పరువంతా గంగలో కలిసిందని బాధపడుతున్న ఇద్దరికీ అట్లా తెలిసింది- తాము ఒకే పడవలో ఉన్నామని.



ఇంకేముంది, దు:ఖం ఆపుకోలేని కోటయ్య రఘురామ్ తలుపుతట్టి పలకరించాడు. రఘురామ్ అతన్ని లోనికి పిలిచి, తన కష్టాలు చెప్పుకొని, కోటయ్య పట్ల సానుభూతి వ్యక్తం

చేశాడు. ఇప్పుడు వాళ్ళిద్దరూ మళ్ళీ మంచి స్నేహితులుగా మారారు!

ఇది జరిగాక వారం రోజులకు కొడుకులిద్దరూ ఇళ్ళకు వచ్చారు. తీసుకున్న డబ్బులు వెనక్కి తెచ్చి ఇచ్చేశారు! అంతవరకూ వాళ్లని తిట్టుకుంటూ, ఏడ్చుకుంటూ ఉన్న మిత్రులిద్దరూ నోళ్ళు వెళ్ళబెట్టారు. "మిమ్మల్ని కలిపేందుకు మేం ఆడిన నాటకమే ఇదంతా" అని ముసిముసి నవ్వులు కురిపించారు కొడుకులు. ఊళ్ళో వాళ్లంతా "మీ కొడుకులకు ఉన్న తెలివి మీకు లేకపోయిందేమి?" అని నవ్వారు.

గొప్పలకు పోతే ఏం జరగచ్చో తెలుసుకున్న మిత్రులు ఇద్దరూ చాలా సిగ్గుపడ్డారు. కొడుకులు తెచ్చిచ్చిన డబ్బుల్ని అనాధాశ్రమానికి దానం చేసేశారు. చేతికి అంది వచ్చిన కొడుకుల ఇళ్ళలో ప్రశాంత జీవితాన్ని గడిపారు.

లక్ష్మీకోటికి ఎవరైనా వెళ్తే ఇప్పటికీ వాళ్ల స్నేహాన్ని గురించే చెబుతుంటారు అందరూ!




ఫ్రీగా వస్తే ఫినాయిలైనా రుచే సార్!

టీచర్ :రామూ! ఎందుకు వెనక కూర్చున్నావు?
రాము:వెనకబడిన వారికి స్కాలర్ షిప్ ఇస్తారని ఇవాళ పేపర్ లో వేశారు టీచర్.



# వేలెడంత పిలగాడు



*వేలెడంత పిలగాడు, పొట్టిబుడంకాయ, బుల్లయ్య లాంటి పేర్లతో ఎంతోమంది చిన్నారి హీరోలు మన కథా సామ్రాజ్యాన్ని ఏలుతూనే వస్తున్నారు. ఒక్కోసారి వాళ్ళు వంకాయలోంచి వస్తే, ఒక్కోసారి మునక్కాయలోంచి, గుడ్డులోంచి వస్తుంటారు. వచ్చిన ప్రతిసారీ అసాధ్యాలను సుసాధ్యాలు చేసి పోతుంటారు- ఈ పిలగాడు ఏంచేశాడో రాజు మాటల్లో..*

*కథనం: బి. రాజు, 8 వ తరగతి, జి.ప. ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి*

అనగనగా లక్ష్మీపురం అని ఒక గ్రామం ఉండేది. ఆ గ్రామంలో ఒక ముసలవ్వ ఉండేది. ఆ అవ్వకు ఎవరూ లేరు. ఒక రోజు అవ్వ మూడు కోడి గుడ్లు తెచ్చింది. రెండు గుడ్లను పగల గొట్టి పక్కన పెట్టుకుంది. మూడవ గుడ్డును కొట్టబోయేసరికి, ఆ గుడ్డులో నుండి, "అవ్వా! అవ్వా! నన్ను చంపకు" అని వినిపించింది. అవ్వకు ఆశ్చర్యమేసింది. జాగ్రత్తగా వినింది. శబ్దం గుడ్డు లోపలి నుండి వస్తున్నది. "అవ్వా! నేను చిన్న పిల్లవాణ్ని.

నన్ను చంపకు. నన్ను మెల్లిగా ఈ గుడ్డు నుండి బయటకు తీయి" అని మాటలు వినిపించాయి.



అవ్వ గుడ్డుని మెల్లగా పగలగొట్టి అందులో నుండి బొటన వేలెడంత పిల్లాణ్ణి బయటకు తీసింది. వాడి అవతారం చూసి అవ్వకు భలే ముచ్చటేసింది.

ఆ పిలగాణ్ణి చూసి, "తిందామని తెచ్చుకున్న గుడ్డును తిననీకుండాచేసావు, ఇప్పుడు నా ఆకలి ఎట్లా తీరేది?" అని అవ్వ అనింది. ఆ మాటలకు, "అవ్వా! నీ దగ్గరున్న రూపాయి ఇవ్వు. నేను వెళ్ళి నీకు కావలసిన కూరగాయలు, బియ్యం తీసుకొని వస్తాను," అని చిన్నోడు అన్నాడు. అవ్వ వాడికి రూపాయి ఇచ్చింది.

అది తీసుకొని బియ్యం అంగడికి వెళ్ళి అంగడాయన్ని గట్టిగా పిలిచాడు. అంగడాయన "ఎవరు పిల్చార్రా" అని అంతా వెతికాడు. కానీ ఆయనకు ఎవరూ కనబడలేదు. "అయ్యా! నేనిక్కడున్నాను చూడు, ఇదిగో నీ టేబిలు మీదున్నాను చూడు" అని పిలగాడు అరిచాడు. ఇప్పుడు అంగడాయనకు టేబిలు మీద వేలడంత పిలగాడు కనిపించాడు. "సరే, నీకేమి కావాల"ని ఆయన అడిగితే, పిలగాడు ఆయన చేతిలో రూపాయి పెట్టి, "నాకు ఒక చెవి నిండా బియ్యం, ఒక చెవి నిండా బ్యాళ్ళు (కందిపప్పు) పోయ"మన్నాడు.

"దానిదేముందిలే" అని, పిడికెడు బియ్యం తీసుకొని ఒక చెవిలో పోసాడు అంగడాయన. కానీ అది నిండ లేదు. ఇంకొన్ని పోసాడు. నిండ లేదు. సేర్లు, సేర్లు పోసినా నిండలేదు. చివరికి అంగట్లో ఉండేబియ్యం అంతా పిలగాడి చెవిలో పోసినా అది నిండలేదు. తర్వాత

ఇంకొక చెవిలోకి ఇలాగే అంగట్లో ఉండే బ్యాళ్ళన్నీ కుమ్మరించేసాడు. చివరికి, "అయ్యా! నువ్వు నా చెవులు నిండేట్టుగా బియ్యం, బ్యాళ్ళు పోయలేదు కాబట్టి, నా రూపాయి నాకిచ్చేయి!" అని తన రూపాయి వెనక్కి తీసేసుకున్నాడు చిన్నోడు.

తరువాత వేరే వేరే అంగళ్ళ కెళ్ళి చక్కెర, గోధుమ పిండి లాంటివన్నీ సంపాదించాడు వాడు. కూరగాయల దుకాణానికెళ్ళి కావలసిన కూరగాయలన్నీ చెవుల్లో పోసుకున్నాడు. ఎన్ని సరుకులు చెవుల్లో పోసుకున్నా అతని చెవులు నిండలేదు. ఇలా బజారులోని సరుకులన్నీ చెవుల్లో పోసుకొని ఇంటికెళ్ళాడు.

అతన్ని చూస్తూనే, "ఏంటి నాయనా! ఖాళీ చేతుల్తో వచ్చావు?" అని అవ్వ అడిగింది. "అవ్వా! నీ కోసం చాలాతెచ్చానవ్వా! ముందు నువ్వు ఇంటి తలుపులు, కిటికీలు మూసేసి గవాచీ(ఇంటి కప్పుకు ఉండే చిన్న కిటికీ, గవాక్షం) తెరిచి పెట్టు" అన్నాడు. అవ్వ అలాగే చేసింది. పిలగాడు మిద్దెమీదికెళ్ళి, గవాచీ గుండా తన చెవులు పట్టుకొని కదిలించాడు.

అంతే! కుప్పలు కుప్పలుగా బియ్యం, బ్యాళ్ళు, గోధుమ పిండి, చక్కెర, పళ్ళు, కూరగాయలతో ఇల్లు నిండిపోయింది!! ఇది చూసి అవ్వ ఆశ్చర్యపోయింది. ఇప్పుడు అవ్వకు, పిల్లోడికి ఏం కష్టం లేకుండా చాలా రోజులు గడిచాయి.



కొన్ని రోజులకు వాళ్ళ రాజ్యానికి ఒక పెద్ద కష్టం వచ్చింది. ఒక పెద్ద రాక్షసుడు వచ్చి రాజ్యంలో చేతికి చిక్కిన ప్రజలను తినేస్తూ వచ్చాడు. అప్పుడు రాజు రాజ్యమంతా చాటింపు వేయించాడు - "ఎవరైతే ఆ రాక్షసుడిని చంపుతారో వాళ్లకు అర్థ రాజ్యాన్నిచ్చి, నా కుమార్తెను కూడా ఇచ్చి పెళ్ళి చేయిస్తా" అని.

రాజ్యంలోని వీరులు చాలా మంది రాక్షసుడిని చంపడానికి ప్రయత్నించి తమ ప్రాణాలను కోల్పోయారు.

ఈ విషయం తెలుసుకున్నాడు చిన్నోడు. ఎలాగైనా ఆ రాక్షసుడిని చంపాలని వాడికి పట్టుదల కలిగింది. ఒక్కడే ఒక చాకును తీసుకొని, రాక్షసుడుండే తావుకు బయలుదేరాడు. అవ్వ భయపడి అడ్డం వచ్చింది-"వద్దు నాయనా, ఆ రాక్షసుడు నిన్ను చంపేస్తాడు. నాకు తోడంటూ ఉండేది నువ్వొక్కడివే. వెళ్ళద్దు నాయనా" అని చెప్పి, వాడు బయటకు పోకుండా ఇంటి తలుపులు, కిటికీలు వేసి ఏదో పని మీద బయటకు వెళ్ళింది.

అవ్వ అటు పోతూనే, పిలగాడు తలుపు సందులోంచి దూరి బయటకు వెళ్ళాడు. గబగబా నడిచి రాక్షసుడు ఉండే చోటుకు వెళ్ళాడు.

రాక్షసుడు ఇతన్ని గమనించలేదు. పిలగాడు రాక్షసుడి దగ్గరికి చేరుకొని మెల్లగా అతని కాళ్ళకుండే వెంట్రుకలను పట్టుకొని అతని పైకి ఎక్కాడు. అట్లా అట్లా తలపైకి ఎక్కాడు. రాక్షసుడి ప్రాణం అతని తలపైన ఉండే కొమ్ములో ఉందని పిలగాడికి తెలుసు. తను తెచ్చిన చాకుతో కొమ్మును నిదానంగా కోయడం మొదలు పెట్టాడు. రాక్షసుడు ఎటు తల తిప్పితే, పిల్లవాడు దానికనుగుణంగా కోసాడు. తలమీద ఏదో చికాకుగా ఉందని రాక్షసుడు తన చేత్తో కొమ్మును గట్టిగా కొట్టాడు. అంతే ! కొమ్ము విరిగిపోయింది!! రాక్షసుడు చనిపోయాడు!



రాక్షసుణ్ణి ఎవరు చంపారో తెలిసింది రాజుగారికి. ఆ పిలగాడ్ని తన ఆస్థానానికి రమ్మని ఆయన కబురు పెట్టించాడు. మరుసటి రోజున చిన్నోడు బాగా ముస్తాబై

రాజధానికి బయలుదేరాడు. వాళ్ళ ఊరి నుండి రాజధానికి వెళ్ళే దారిలో ఒక పెద్ద అడవి ఉంది. ఆ అడవిలో పోతా ఉంటే "నిన్ను తినేస్తా, నాకు చాలా ఆకలిగా ఉంది" అని గట్టిగా అరుస్తూ ఒక సింహం అతని ముందుకు దూకింది. సింహాన్ని చూసి పిలగాడు ఏమాత్రం భయపడలేదు. "సింహం, నేను నీకోసమని మంచి ఎద్దులు రెండు ఇంటి దగ్గర పెట్టి ఉన్నాను. నాతో రా!" అని సింహాన్ని తన ఎడమ చెవిలోకి ఎక్కించుకున్నాడు.

ఇంకొంచెం దూరం వెళ్ళాక ఒక పులి ఎదురైంది. అది కూడా పిలగాణ్ణి తినేస్తానని భయపెట్టింది. "అయ్యో, పులిబావా! వేలెడంత ఉండే నేను, కొండంత ఉండే మీకు ఎక్కడికి సరిపోతాను? నీకోసం మా ఇంట్లో మేకలు తెచ్చి పెట్టి ఉన్నాను. రా, పోదాము" అని పిలగాడు పులిని తన కుడి చెవిలోకి ఎక్కించుకున్నాడు. అలాగే దారిలో ఎదురైన ఏనుగుకు చెరుకు గడలు, నక్కకు కోళ్ళు ఇస్తానని ఒక దాన్ని ఎడమ ముక్కులోకి, ఇంకోదాన్ని కుడి ముక్కు లోకి ఎక్కించుకున్నాడు. అడవి పిల్లులు ఎదురై వాణ్ణి తినేస్తామంటే "మీకోసం మాఇంట్లో చాలాఎలకల్ని పెంచుతున్నా" అని చెప్పి, వాటిని జేబులోకి వేసుకున్నాడు. ఇట్లా నడుస్తూ పోతాఉంటే అతనికి ఒక నది అడ్డం వచ్చింది. "నాకు నిప్పు ఇస్తేనే నేను నిన్ను దాటనిచ్చేది" అని ఆ నది మొండికేసింది. "అయ్యో, నా దగ్గర ఇప్పుడు నిప్పు లేదు. నేను రాజాస్థానానికి పోతున్నా. అక్కడ చాలా నిప్పు ఉంది. అక్కడికి రా, ఇస్తాను" అని నదిని మొత్తం తన నోట్లో పోసుకున్నాడు చిన్నోడు.

ఇన్ని చేసుకొని చివరికి రాజు దగ్గరకు చేరుకున్నాడు అతను.

రాజు ఆ పిలగాణ్ణి చూసి చాలా నిరాశపడ్డాడు. "వేలెడంత ఉండే ఇంత చిన్నవాడికా, నా కూతుర్నిచ్చి పెళ్ళి చేసేది? అలా వీలు కాదు" అనుకున్నాడాయన. "వేలెడంత పిలగాణ్ణి పట్టుకొని ఎలకల బొక్కలో వేసేయండి" అని భటుల్ని ఆజ్ఞాపించాడు. ఎలకల బొక్కలో పడగానే చిన్నోడు తన జేబులో నుండి పిల్లుల్ని బయటికి తీసి వదిలాడు. అవి ఎలకలన్నింటినీ

తినేసి అడవిలోకి వెళ్ళిపోయాయి.

చావకుండా ఎలకల బొక్క బయటకొచ్చిన పిలగాణ్ణి పట్టుకొని భటులు కోళ్ళ గూటిలోకి వేసారు. అంతే! పిలగాడు తన కుడి ముక్కులో నుండి నక్కల్ని వదిలాడు. అవి కోళ్ళను తినేసి అడవిలోకి వెళ్ళి పోయాయి.

ఇంకా బతికున్న పిలగాణ్ణి భటులు మేకల మందలోకి విసిరారు. అపుడు పిలగాడి కుడి చెవిలోంచి పులి వచ్చి మేకల్ని తినేసింది.

తర్వాత అతన్ని చెరుకుతోటలోకి విసిరేసారు. అప్పుడు అతని ఎడమ ముక్కులోనుండి ఏనుగు వచ్చి చెరుకంతా తినేసి సంతోషంగా వెళ్ళి పోయింది.

ఎంతకీ చావని పిలగాణ్ణి భటులు ఎద్దుల మందలోకి విసిరేసారు. "ఎద్దుల కాళ్ళ కింద పడి చస్తాడులే" అని భటులు అనుకుంటే, అతని ఎడమ చెవిలోనుండి వచ్చిన ఒక సింహం ఎద్దులన్నింటినీ తినేసి వెళ్ళి పోయింది.

చివరికి భటులు ఒక గుంత తవ్వి, అందులో అతన్ని పడేసి, గడ్డి వేసి నిప్పంటించారు. అప్పుడు పిలగాడు తన నోట్లో నుండి నదిని బయటకు వదిలాడు. అది నిప్పును ఆర్పేసి వెళ్ళి పోయింది.

ఈ పిలగాడు సామాన్యుడు కాడని రాజుకు అర్థమైపోయింది. ఇంక ఏమీ అడ్డు చెప్పకుండా అర్ధ రాజ్యమిచ్చాడు. తన కూతుర్నిచ్చి వివాహం చేసాడు. చూస్తూండగానే పిలగాడు కూడా పెద్దవాడయిపోయినాడు. రాజ్యానికి ఏ కష్టాలూ లేకుండా అందరూ సుఖంగా జీవించసాగారు!



**రంధ్రాన్వేషి!**

నవ్వండి!

దేనిలోనైనా తప్పులు వెతికేవాడిని బావిలోకి విసిరేస్తే ఏమంటాడు?

"ముందుగా సబ్బు, టవలు పెట్టకుండా స్నానానికి పంపద్దని చెప్పానా, లేదా?" అని అరుస్తాడు.




# నేను సాధించాను!

*రచన: సాయి అజయ్,10 వతరగతి,తేజ టాలెంట్ స్కూల్, కోదాడ.*
*సౌజన్యం: బాలోత్సవం, కొత్తగూడెం, నవంబరు*2010.

'నేను తప్పిపోయానా...? నా వాళ్ళు ఎక్కడ..? నేను ఎక్కడున్నాను, ఇప్పుడు..? ఇప్పుడు నేను ఏం చేయాలి..?'

విహారయాత్రలో భాగంగా ఈ అడవికి వచ్చాను నేను..దారి తప్పినట్లున్నాను! చూడగా ఇక్కడి అడవంతా ఎత్తైన చెట్లతో, గుబురు పొదలతో నిండి ఉన్నది- దారీ తెన్నూ కనబడటం లేదు.

చుట్టూ కలయచూసాను.. ఎవ్వరూ లేరు! నాలో ఒక విధమైన వణుకు మొదలవుతున్నది- ఈ ప్రదేశం అంతా నాకు కొత్త- 'మరిప్పుడు నేను ఏం చేయాలి? నా వాళ్ళని నేను ఎలాగ, చేరుకునేది?'

సూర్యుడు నడినెత్తికి వచ్చినట్లున్నాడు. 'నేను ఊరికే భయపడుతున్నానా?..' నన్ను నేను మానసికంగా గట్టి పరచుకొనేందుకు సిద్ధపడ్డాను.. నా మెదడు స్తంభించిపోయి ఉన్నది- 'ఒక వేళ నేను ఈ అడవిలోనే ఇరుక్కుపోతే..? రాత్రైనా ఇక్కడే ఉండి పోవాల్సి వస్తే..?'

నాకు భయం మొదలైపోయింది..ఆత్మ రక్షణకే అయినా సరే- నా దగ్గర ఏలాంటి అస్త్రాలు, శస్త్రాలు, ఆధునిక పరికరాలు- ఏవీ లేవు..

'అసలు నేనెందుకు, భయపడుతున్నాను?' అని ఒక్కసారిగా ఆలోచన మొదలైంది. 'నేను భయపడాల్సిన అవసరం ఏముంది, అసలు? నేను కొంచెం ప్రయత్నం చేస్తే చాలు- ఇక్కడ నుంచి బయట పడగలను' అని గట్టిగా అనిపించింది.

ప్రపంచంలో కెల్లా అత్యంత బలమైన వస్తువులు మూడు ఉన్నాయి నా దగ్గర - 'ఆత్మవిశ్వాసం', 'పట్టుదల', 'కృషి'-నేను మనస్ఫూర్తిగా నమ్మిన అస్త్రాలు, ఈ మూడూ. ఇవి నాకు ఈ ఆపత్సమయంలో ఎంతగానో ఉపయోగపడుతున్నాయి..

వెంటనే నాకు ఒక సత్యం గుర్తుకువచ్చింది: "పట్టుదల ఉంటే ఏదైనా సాధించవచ్చు-" మా టీచరుగారు ఎప్పుడూ చెబుతుండే ఈ వాక్యం ఎంత నిజం! ఈ ఆలోచన నాకిప్పుడు ఎంతో ధైర్యాన్నిస్తోంది.. "నేను ఇక్కడకు ఎలా వచ్చానో, ఏ దారిన వచ్చానో గుర్తించేందుకు ప్రయత్నం మొదలుపెట్టాను. నా మనసును అలుముకొని ఉన్న భయాల ప్రపంచాన్ని తాత్కాలికంగా మర్చిపోయాను.

నా ముందున్న మార్గం పైననే కేంద్రీకరించి ఉంది నా మనసంతా..ఇప్పుడు నాలో వణుకు తగ్గసాగింది..నేను వచ్చిన దారిని గుర్తుచేసుకుంటూ ముందుకు సాగాను. ఏ వైపు వెళ్తే ఎటు చేరతానో తెలీదు నాకు; కానీ

'నేను ఇక్కడినుండి బయట పడతాను' అని మాత్రం నాకు తెలుసు. నా ఈ ఆత్మవిశ్వాసమే నన్ను ముందుకు నడిపించింది.



ఒకసారి ఇలా నా మనసుకు నెమ్మది కుదిరాక, అప్పుడు చుట్టూ ఉన్న ప్రకృతి అందం నన్ను తట్టిలేపింది..మైమరపించింది.

అపురూపంగా కనిపిస్తున్న ఆ దృశ్యాన్ని చూస్తున్నకొద్దీ నా మనసు సంతోషంతోటీ, ఉత్సాహంతోటీ నిండిపోయింది.

నేను అలా నడుస్తూనే వున్నాను..చాలా సేపటి వరకు నడుస్తూనే వున్నాను..కొంతసేపటికి నాకు ఏవో మోటారు కార్ల శబ్దాలు వినిపించడం మొదలైంది. నాకు అర్థమైపోయింది..ఇక నా ప్రయాస అంతం కానున్నది. నేను ఆ శబ్దం వస్తున్న వైపుగా అడుగులు వేశాను.

త్వరలోనే నేను ఒక రోడ్డు మీదకు వచ్చాను. రోడ్డును చూడగానే నాకు కొంత సాంత్వన కలిగింది. నాకు బాగా గుర్తు, ఈ రోడ్డు మీది నుంచే మేము బయల్దేరింది..ఇక ఆ మార్గాన్ని అనుసరించి నడవటం ప్రారంభించాను నేను.

కొంచెం సేపు అట్లా నడిచాక దూరంగా ఎవరో మనుషులు కనిపించారు- ఎవరో కాదు..మా వాళ్ళే! నాకోసమే వెతుక్కుంటున్నట్లున్నారు! నేను పరిగెత్తుకుంటూ వెళ్ళి కలుసుకున్నాను వాళ్ళని. నేను సాధించాను!

ఆత్మవిశ్వాసం, పట్టుదల, కృషి- ఈ ఆయుధాలు మన దగ్గర ఉన్నంతకాలం మనం సాధించలేనిదంటూ ఏదీ ఉండదు. ✿

మూర్ఖుడికి తన ఇంట్లో గౌరవం, వ్యాపారికి తన ఊళ్ళో గౌరవం లభిస్తాయి. రాజుకు తన దేశంలో గౌరవం ఉంటుంది. విద్య ఉన్నవాడికి ఎక్కడున్నా గౌరవమే! *-(సుభాషితం)*



# పొరుగింటి చీర



*సేకరణ: తరుణిస్ఫూర్తి, 5 వ తరగతి, ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, గడ్డంనాగేపల్లి, అనంతపురం జిల్లా.*

రామాపురంలో రాజప్ప అనే ధనిక వర్తకుడొకడు ఉండేవాడు. అతని భార్య పేరు సరళమ్మ. సరళమ్మకు కొత్త బట్టలంటే చాలా ఇష్టం. రోజుకు కనీసం మూడు సార్లయినా బట్టలు మార్చేది. ఆమె ఇష్టానికి తగినట్లు రాజప్ప ఆమెకు చాలా బట్టలు కొనిపెట్టేవాడు.

ఒక రోజు ఉదయం సరళమ్మ బీరువాలో నుండి ఒక కొత్త చీర తీసింది- కట్టుకుందామని. ఎందుకో ఆ చీర ఆమెకు పెద్దగా నచ్చలేదు. దాన్ని కొంచెం వెలుతురుకు పెట్టి అటూ ఇటూ తిప్పి చూసింది- బాగా అనిపించలేదు- అంతే! విపరీతమైన కోపం వచ్చేసింది. రుసరుసలాడుతూ చీరను కిటికీ గుండా బయటకు విసిరేసింది!

రోడ్డు మీద నడుస్తూ పోతున్న ఒక బిక్షగాడి మీద పడింది ఆ చీర. అతను ఓసారి తల పైకెత్తి చూసి, అటుపైన 'ఆ చీరను ఏం చేద్దామా' అని ఆలోచించాడు. వేసవి కాలమేమో, ఎండ

బాగాకాస్తున్నది. ఎండ తగలకుండా ఆ చీరని నెత్తి మీద వేసుకొని నడక సాగించాడు భిక్షగాడు.

అతని తల మీదున్న చీరను చూసింది ఒక పేదరాలు. ఎన్నాళ్ళుగానో ఒక మంచి చీరను కొనుక్కోవాలనుకుంటోందామె. చీర నచ్చితే ధర నచ్చేది కాదు. ఇప్పుడు ఈ భిక్షగాడి తలమీది చీర ఆమెకు తొలిచూపులోనే నచ్చిపోయింది. చీర విలువ తెలీని భిక్షగాడు దాన్ని ఆమెకు కారు చౌకగా ఇచ్చేశాడు కూడానూ- ఇంతా చేసి ఆ పేదరాలు ఎవరో కాదు- రాజప్ప ఇంట్లో పని మనిషే!

మరుసటి రోజు పనిమనిషి కట్టుకొచ్చిన కొత్త చీరను చూసింది సరళమ్మ. ఆమె దాన్ని గుర్తు పట్టలేదు గానీ, ఏ మనసున ఉన్నదో, ఆ చీర ఇప్పుడు ఆమెకు చాలా నచ్చేసింది! "అంతమంచి చీరను తను కాకుండా, తన పనిమనిషి కట్టుకోవటమేంటి?!" అనిపించింది. "ఎట్లాగైనా ఆ చీరనే తెచ్చివ్వు" అని పోరింది రాజప్పను.

"పని మనిషి కట్టిన చీర నీకెందుకు, ఇంకా మంచిది కొనిస్తాను!" అని రాజప్ప ఎంత చెప్పినా, సరళమ్మ వింటేగా?! చివరికి రాజప్ప ఒక మంచి పట్టుచీర కొనుక్కొచ్చి, దాన్ని పని మనిషికి ఇచ్చాడు. అటుపైన ఆమె కట్టిన చీరను తీసుకొచ్చి ఇచ్చి, భార్య ముచ్చటా తీర్చాడు.

అది తను కిటికీ గుండా పారేసిన చీరే అని తెలియదు సరళమ్మకు . ఇప్పుడు మరి ఆ చీర అంటే ఆమెకు ప్రాణం!



**చెప్పు తెలివి!**

నవ్వండి!

మల్లప్ప: ఏదైనా మాంసాహారం తినాలనిపిస్తోంది రా!

వెంగళప్ప: సరే, చేపలు తిందామా?

మల్లప్ప: చేపలకు ముళ్లుంటాయి కదా!

వెంగళప్ప: మరేం ఫర్వాలేదు, చెప్పు తీసుకొని తిందాం, సరిపోతుంది.



# మూడు ముచ్చట్లు

**యాత్రావిశేషం**

*రచన: చరిత గంగి, రెండో తరగతి, ఫ్రీమాంట్, కాలిఫోర్నియా, అమెరికా.*

*తెలుగు: ప్రభాకర్ గంగి.*



మిత్రులారా,

నా పేరు చరిత గంగి. నేను ఇండియాలోనే పుట్టాను. నాకు రెండేళ్లప్పుడు మా నాన్నగారి ఉద్యోగం పని మీద మేం అందరం అమెరికాకు వెళ్లాం. నాకు ఐదేళ్ళొచ్చేసరికి నేను అక్కడే బడికి వెళ్లడం మొదలుపెట్టాను. అక్కడ టీచర్లు బడి పిల్లలను ఎంతో ప్రేమగా చూస్తారు. మా తరగతిలో పిల్లలు కూడా నాలాగే వేరు వేరు దేశాలనుండి వచ్చారు.

అయితే మా బడిలో పిల్లలంతా ఇంగ్లీషులో మాట్లాడతారు కదా, అందుకని నేను తెలుగు పూర్తిగా మరచిపోయాను. మా అమ్మ, నాన్న తెలుగులో మాట్లాడినా నేను మాత్రం ఇంగ్లీషులోనే జవాబు ఇచ్చేదాన్ని. ఇప్పుడు

ఈ సంగతులు కూడా నేను ఇంగ్లీషులో చెబితే మా నాన్న తెలుగులోరాసి పెడుతున్నారు.

****

డిసెంబరులో మాకు చలికాలం సెలవలు ఇస్తారు. ఆ సమయంలో మేం అందరం కలిసి ఇండియాకు వచ్చాము. విమానంలో 26 గంటలు ప్రయాణం చెయ్యాలి, తెలుసు గద! దాంతో బాగా అలసిపోయి, మరుసటి రోజంతా నిద్రపోయాం!

తరువాతి రోజున రైలులో 'షిర్డి'కి బయలుదేరాం. మేం రైలు ఎక్కేసరికే మిగిలిన ప్రయాణీకులంతా నిద్రపోతున్నారు. ఇంకేం చేస్తాం, అందుకని మేము కూడా నిద్రపోయాం.

అకస్మాత్తుగా ఎవరెవరో అరవటం మొదలు పెట్టారు- "పేపర్, పేపర్, టీ, టీ , కాఫీ, కాఫీ, ఇడ్లీ, ఇడ్లీ, దోసె, దోసె" అని. గబుక్కున నిద్రలేచి చూస్తే సమయం ఇంకా ఐదున్నరే!

"నాన్నా! ఏంటి ఆ అరుపులు ?" అడిగాను, బెదురుగా లేచి కూర్చొని.

"ప్రయాణం చేస్తున్నవాళ్లకి అవసరమయ్యే వస్తువులు అమ్ముకుంటున్నారమ్మా, వాళ్లంతా" అన్నారు నాన్న.

"వాళ్లు రైలులోకి రావచ్చా? టిక్కెట్లు కొంటారా, వాళ్లంతా?" అడిగాను నేను.

"లేదమ్మా, అయితే ప్రతిరోజూ అమ్ముకునే-వాళ్లకి మటుకు రైలువాళ్ళు గుర్తింపు పత్రాలు ఇస్తారు. అవి ఉంటే వాళ్లనెవ్వరూ ఏమీ అనరు" చెప్పారు నాన్న.

"చిన్న పిల్లలు కూడా పని చెయ్యాలా, ఇక్కడ?" అడిగాను నేను.

"ఇండియాలో చాలా మంది పేదవాళ్ళు ఉన్నారమ్మా. అందుకని ఇక్కడ పిల్లలు కూడా పనిచేస్తారు. డబ్బులున్న వాళ్ల పిల్లలైతే పనిచెయ్యక్కర్లేదు.." అన్నట్లు ఏదో చెప్పారు నాన్న. అది విని నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఎందుకంటే అమెరికాలో పిల్లలెవ్వరూ పనిచెయ్యరు మరి!

అంతలో మానాన్న లేచి వెళ్ళి న్యూస్ పేపరు కొనుక్కొచ్చుకున్నారు. మా నాన్న పేపరు చదువుతుంటే, నేనేమో రైలు కిటికీ దగ్గర

కూర్చొని బయటికి చూస్తూ ఉండిపోయాను.

కొంచెం సేపటికి చూస్తే ఎందుకనో, మా నాన్న సంతోషంగా లేరు! "ఏంటి నాన్నా, విషయం?" అని అడిగాను.

"ఇందాక నేనొక న్యూస్ పేపర్ కొనుక్కొచ్చాను కదా, అది నిన్నటిది! ఎవరో నాకు పాత న్యూస్ పేపరు అమ్మారు!" బాధగా చెప్పారు మా నాన్న.

అది మోసం. ఇక్కడి ప్రజలు ఎందుకు మోసం చేస్తున్నారో నాకు అర్థం అవ్వలేదు. కాని, ఈ సంఘటన నా మనస్సును ఎంతో బాధించింది. ఎందుకంటే అమెరికాలో చిన్న పిల్లలు కూడా ఎప్పుడూ కూడా మోసం చేయరు.

***

తర్వాత షిర్డీలో మేం అందరం దర్శనం అయ్యాక గుడి నుండి బయటకు వచ్చాము గదా, అక్కడ చాలా మంది గుంపుగా ఉన్నారు. ఒకళ్లనొకళ్ళు నెట్టుకుంటూ, తోసుకుంటూ గొడవ చేస్తున్నారు. "వాళ్లు ఏం చేస్తున్నారు నాన్నా?"అని అడిగాను మా నాన్నను.

"దేవుడి ప్రసాదం కోసం ఒకరి మీద ఒకరు పడుతున్నారమ్మా" అని చెప్పారు మా నాన్నగారు.



అది విన్న తరువాత నాలో నాకు చాలా కోపం వచ్చింది. ఇక్కడ అందరూ "క్యూ" ఎందుకు పాటించరు? "వరుసలో నువ్వు ఒక్కదానివే ఉన్నాకూడా క్యూ పాటించాలి. ఎవరు ముందుగా వస్తే వాళ్లు ముందుగా 'క్యూ'లో

నిలబడాలి " అని మా నాన్న నాకు ఎప్పుడూ చెబుతుంటాడు.

***

మరుసటి రోజు మధ్యాహ్నం ఒంటిగంటకల్లా తిరిగి రైల్వే స్టేషన్ చేరుకున్నాము. ఆ రోజు చాలా వేడిగా ఉన్నది. స్టేషనంతా జనాలతో నిండిపోయి ఉంది.



అకస్మాత్తుగా నాకు ఒక కుక్క, దాని ఐదు పిల్లలు- కనబడ్డాయి. ఆ కుక్క పిల్లలు ఎంత ముద్దుగా ఉన్నాయో! కాని వాటికి సరైన పాలు, అన్నం దొరుకుతున్నట్లు లేదు. బక్కగా చిక్కి పోయి ఉన్నాయవి.

హఠాత్తుగా , నాకు గుర్తొచ్చింది- నా దగ్గర బిస్కెట్లున్నాయి కదా, వాటిని తీసి ఆ కుక్క పిల్లలకు ఇచ్చాను. ఆవురావురని తినేశాయి వాటిని అవి.

"ఈ కుక్క పిల్లల్ని మనం తీసుకెళ్లి పెంచుకుందాం, ప్లీజ్" అని మా అమ్మ-నాన్నలను ఎంత అడిగానో! కానీ వాళ్లు దానికి ఒప్పుకోలేదు. "మనం మళ్లీ అమెరికాకి వెళ్లి పోవాలి కదా, వీటిని విమానంలో రానివ్వరు" అన్నారు.

అంతలోనే రైలు వచ్చింది. మా నాన్న నా చెయ్యి పట్టుకొని నన్ను రైలులోకి తీసుకెళ్లారు- కానీ నా మనసంతా ఆ కుక్క పిల్లలపైనే ఉంది. అప్పుడే నాకు ఒక గొప్ప ఆలోచన వచ్చింది: "నేను పెద్దైన తరువాత బాగా డబ్బులు సంపాదించి, ఇండియాలో ఉన్న అన్ని వీధికుక్కలకు, పిల్లులకు, ఆవులకు నివాసమూ, ఆహారమూ కల్పిస్తాను" అని.

మీరు కూడా మీకు కనిపించిన ఏ జంతువుకూ హాని చేయద్దు. మీకు చేతనైన సహాయం చెయ్యండి వాటికి. 

ఉంటాను ఇక. బై!



# పనీ-పాట

*రచన: కె. గౌరీప్రియ, 7 వ తరగతి, జి.ప. ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

పల్లెన్నగారి పల్లిలో ఇంద్ర, చంద్ర అనే ఇద్దరు స్నేహితులు ఉండేవాళ్ళు. వాళ్ళు రోజూ బడికి పోయేవాళ్ళు; బాగా చదువుకునేవాళ్ళు. ఇంద్ర చాలా లావుగా ఉండేవాడు. చంద్ర ఏమో, చాలా సన్నగా ఉండేవాడు. వాళ్ళ బళ్ళో పిల్లలందరూ వీళ్ళని 'దుబ్బోడా', 'బక్కోడా' అని ఎగతాళి చేసేవాళ్ళు.

ఇంద్ర, చంద్రలు ఇళ్ళల్లో బాగా పని చేసేవాళ్ళు. రోజూ పశువుల కొట్టం శుభ్రం చేసేవాళ్ళు; తల్లిదండ్రులకు చేదోడు వాదోడుగా ఉండేవాళ్ళు; సెలవుల్లో కొండల పైకి పశువుల్ని తోలుకెళ్ళి మేపేవాళ్ళు. పొలంలో కూడా చిన్న చిన్న పనులు చేసేవాళ్ళు- ఈ పనులన్నీ చాలా సరదాగా, ఆటపాటల్లాగా చేసేసేవాళ్ళు. పశువులతో కొండల్లో తిరిగేటప్పుడు, బలిస పళ్ళు, రేణి పళ్ళు, నేరేడు పళ్ళు, కలివి పళ్ళు,

ఈత పళ్ళు బాగా తినేవాళ్ళు. చేన్లో పని చేసేటప్పుడు శనక్కాయలు, కంది కాయలు లాంటివి బాగా తినేవాళ్ళు. ఇలా పనిచేస్తూ, అనుకోకుండానే వాళ్ళిద్దరూ చాలా విద్యలు నేర్చుకున్నారు: ఎద్దుల బండి నడపడం, మడక(నాగలి)దున్నడం, తోటకు నీళ్ళు కట్టడం లాంటి పనులు అలవోకగా, సరదాగా నేర్చేసుకున్నారు.



ఇంద్ర, చంద్రలంటే వాళ్ళ అమ్మానాన్నలకు చాలా ఇష్టం. ఏనాడూ వాళ్ళు వీళ్ళని పనులు చేయమని బలవంతపెట్టలేదు- పిల్లలే వాళ్ళంతట వాళ్ళు ఇష్టంగా చేసేవాళ్ళు, అన్ని పనుల్నీ. అలా పనులు చేసుకుంటూ వాళ్ళిద్దరూ అమ్మా నాన్నల నుండి ఎన్ని కథలు విన్నారో; పాటలు, పొడుపు కథలు లాంటివి కూడా, ఎన్ని నేర్చుకున్నారో! అన్నింటి కంటే ముఖ్యమైనది, వీళ్ళు చాలా చిన్నగా ఉన్నప్పుడే అమ్మానాన్నలు వాళ్లకు బావిలో ఈత కొట్టడం నేర్పారు. సెలవుల్లో ఇది కూడా వాళ్ళకు గొప్ప సరదాగా ఉండేది.

అయితే ఊళ్ళో పిల్లలందరూ చాలా నాజూగ్గా ఉండేవాళ్ళు. వాళ్ళ మాటలు, బట్టలు, స్కూలు బ్యాగులు, తిండి, నడక, అభిరుచులు అన్నీ ఒక విధంగా ఉండేవి. ఇంద్ర, చంద్రలేమో పాత కాలపు పల్లె పిల్లల్లాగా ఉండేవాళ్ళు. అందుకని కూడా అందరూ వీళ్ళను కొంచెం చులకనగా చూసేవాళ్ళు.

ఒకసారి ఊళ్ళో పిల్లలు కొందరు బావిలో ఈత కొట్టడానికి వెళ్ళారు. ఇంద్ర-చంద్రలు ఇద్దరూ అక్కడే ఏవో పనుల్లో మునిగి ఉన్నారు. మిగిలిన పిల్లలందరూ నీళ్ళలోకి దిగారు. అంతలో నీళ్ళలో జరజరా పాక్కుంటూ పోతున్న పాము ఒకటి కనిపించింది వాళ్ళకు.

అంతే! మరుక్షణం పిల్లలందరూ ఒకరిమీద

ఒకరు పడుతూ, లేస్తూ బావిలోంచి బయటికి వచ్చేసారు. అయితే ఈ గందరగోళంలో సోము అనే పిల్లవాడికి బావి అంచు 'ధడాల్'మని కొట్టుకున్నది. తిరిగి నీళ్ళలో పడిపోయాడు- "కాపాడండి, కాపాడండి!" అని అరుస్తూ ఉన్నాడు.



మిగిలినపిల్లలందరూ భయస్తులు; వాళ్ళకి ఈత కూడా అంతగా రాదు. దాంతో వాళ్ళు బయట నిలబడి ఏడవటం మొదలుపెట్టారు. ఈ హడావిడి విని ఇంద్ర, చంద్ర పరుగెత్తుకుంటూ బావి దగ్గరికి వెళ్ళారు. గబుక్కున బావిలోకి దూకి, భయంతో వణికి పోతున్న సోమును బయటికి తీసుకొచ్చారు.

వాడు అప్పటికే కొన్ని నీళ్ళు మింగేసి ఉన్నాడు- వీళ్ళిద్దరూ వాడిని బోర్లా పడుకోబెట్టి, వీపు మీద నొక్కి, నీళ్ళన్నిటినీ కక్కించారు. మిగిలిన పిల్లలందరూ వాళ్ళు చేస్తున్న ఈ పనుల్ని నోళ్ళు వెళ్ళబెట్టి చూశారు.

"ఈ సంగతులన్నీ మీకు ఎవరు నేర్పించారురా?" అడిగాడు సూరి ఆరోజు సాయంత్రం, మిగతా పిల్లలంతా అబ్బురంగా చూస్తుండగా.

"అమ్మానాన్నలకు వాళ్ల పనిలో సాయం చేస్తూ చేస్తూ, మేమే నేర్చుకున్నాం!" చెప్పారు ఇంద్ర, చంద్ర గొప్పగా.

అటు తర్వాత వాళ్ళిద్దరికీ తోటి పిల్లల్లో భలే గౌరవం వచ్చేసింది!



**నవ్వండి!**

**గేదెల పాలు!**

మేనేజర్: గేదెల కోసం అప్పుడనగా అప్పు తీసుకున్నావు, ఇంత వరకూ ఒక్క కంతి కూడా కట్టలేదేమి, రామయ్యా?

రామయ్య: నేను కొన్న గేదెలు ఇంకా పాలివ్వడం లేదు,సార్?



# మాట తీరు

రచన: ఎం.అనిత,8 వతరగతి,శాంతినికేతన్ విద్యాలయం, జహీరాబాద్.

అనగనగా నరేందర్, కిషోర్ అనే డాక్టర్లు ఇద్దరు ఉండేవాళ్ళు. ఇద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరూ కలిసి ఒకే ఊళ్లో ఆసుపత్రి పెడితే చేతినిండా పని ఉండదు కదా, అందుకని ఇద్దరూ ప్రక్క ప్రక్క ఊళ్ళలో ఆసుపత్రులు పెట్టుకున్నారు.

కొంతకాలం గడిచేసరికి, నరేందర్‌కు వాళ్ళ ఊరిలో మంచి డాక్టర్ గా పేరు వచ్చింది. రోజూ చాలా మంది రోగులతో తీరికలేకుండా ఉండేవాడు అతను.

అయితే ప్రక్క ఊళ్ళో కిషోర్ మాత్రం ఎప్పుడు చూసినా ఖాళీగా ఉండేవాడు. ఆ ఊరి ప్రజలు కూడా తమ జబ్బుల్ని నయం చెయ్యమని నరేందర్ దగ్గరికే వచ్చేవాళ్ళు. ఊళ్ళో జనాలు

తనదగ్గరికి రాకుండా అంత దూరం నడిచి ప్రక్క గ్రామానికి ఎందుకు వెళ్తున్నారో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు కిషోర్ కి .

ఒక రోజున నరేందర్ కిషోర్ దగ్గరికి వచ్చాడు . అతని ఆస్పత్రి ఖాళీగా ఉన్నది. అక్కడ కూర్చొని స్నేహితులిద్దరూ ఆ సంగతీ, ఈ సంగతీ చాలా సేపు మాట్లాడుకున్నారు. అప్పుడు కిషోర్ -"చూడు, ఇక్కడ ఆసుపత్రి పెడితే, ప్రజలు ఉపయోగించుకోవటం లేదు. ఊళ్ళోనే ఉన్న నేను వాళ్ళకి పనికిరాలేదు. ఈ ఊరు వదిలేసి హాయిగా పట్నం వెళ్ళి ఆసుపత్రి పెట్టుకుంటే నయమనిపిస్తున్నది. నీ ప్రాక్టీసు బాగానే ఉన్నట్లుంది? ఏంటి నీ రహస్యం?" అని అడిగాడు.

"పల్లెలో నా ప్రాక్టీసు బాగానే ఉంటున్నదే, మరి కిషోర్ దగ్గరికి ఎందుకు రావట్లేదు, రోగులు?" అని ఆశ్చర్యపోయాడు నరేందర్ .

ఇంతలో ఎవరో ఒకతను ఎనిమిది సంవత్సరాల వయసున్న తన కొడుకుని తీసుకొని ఆందోళన పడుతూ ఆసుపత్రికి వచ్చాడు. "నా కొడుకు నిన్న మామిడి-కాయల కోసమని మంచి ఎండలో బయటకు వెళ్లాడు. రోజంతా బయట తిరగటం వలన కాబోలు, ఒళ్లు కాలిపోతోంది! రాత్రంతా నిద్రలేదు! బిడ్డపరిస్థితి ఆందోళనకరంగా ఉంది. మీరే కాపాడాలి" అంటూ ప్రాధేయపడ్డాడు.

కిషోర్ ఆ అబ్బాయిని పరీక్షిస్తూ "వేసవికాలంలో మధ్యాహ్నపుటెండలో పిల్లల్ని బయటకు పంపకూడదని తెలియదా, నీకు? ఆ మాత్రం సంగతి నీకు ఎవరూ చెప్పలేదా? ఇట్లా ఎండలో తిరిగితే జ్వరం రాక మరేం వస్తుంది?" అంటూ తిట్ల దండకం మొదలుపెట్టాడు. ముందు కొంచెం సేపు ఊరుకున్నాడు ఆ అబ్బాయి తండ్రి. అయినా కిషోర్ తిట్లు కొనసాగుతూనే పోయాయి. దాంతో చిర్రెత్తిందో ఏమో, అతను వెంటనే బాబుని తీసుకొని వేరే ఆసుపత్రికి వెళ్లిపోయాడు.

ఇది చూశాక నరేందర్‌కి అర్థమైంది- కిషోర్ వద్దకు రోగులు ఎందుకు రావడం లేదో.

అతని దగ్గర కూర్చొని 'డాక్టరన్నవాడు తన

దగ్గరికి వచ్చిన రోగికి వైద్యం చేయాలి - హితబోధలు కాదు. డాక్టర్ నుంచి రోగులు మంచి మందుల్ని, ఉపశమనం కలిగించే వాక్యాల్ని ఆశిస్తారు. అలాంటప్పుడు ఎత్తిపొడుపు మాటలు రోగికి మేలు చెయ్యక పోగా, కటువుగా అనిపించి వెగటు కలిగిస్తాయి. నువ్వు రోగులకు చక్కని మందులు రాసివ్వు. వాళ్ళ తప్పుల్ని ఎత్తి చూపకు; వీలైతే వాళ్లకు ధైర్యం కలిగేలా మాట్లాడు- లేకపోతే అసలు ఏమీ మాట్లాడకు.

నా మాట మన్నించి నీ పద్ధతిని కొంచెం మార్చుకొని చూడు, నీ ప్రాక్టీసు తప్పక మెరుగవుతుంది. నా ప్రాక్టీసులో రహస్యం ఇదేననుకుంటాను" అన్నాడు నరేందర్.

మిత్రుడి మాటల విలువను గ్రహించిన కిషోర్ ఆనాటి నుంచి రోగుల్ని చక్కగా పలకరించడం ప్రారంభించాడు. కొంత కాలానికి అతనికీ మంచి వైద్యుడిగా పేరు వచ్చింది!






(బాగా గొడవగా ఉన్నక్లాస్‌లోకి)

హెడ్‌మాస్టర్: పిల్లలూ! స్కూలు ప్రశాంతంగా ఉండాలంటే ఏం చేయాలి?

పిల్లలు: స్కూలుకి సెలవులు ఇవ్వాలి.




టీచర్: రామూ! ఇప్పుడు దేవుడు నీ దగ్గరకొస్తే ఏం కోరుకుంటావు?

రాము: ఈ సాయంత్రం మా అమ్మకి తలనొప్పి రావాలని కోరుకుంటాను టీచర్.

టీచర్: ఎందుకలా?

రాము: మా అమ్మకి తలనొప్పి వచ్చినప్పుడల్లా నన్ను ఆడుకోమని బయటకు పంపిస్తుంది మరి.




అమ్మ: రామూ! పరీక్షలో ప్రశ్నలన్నిటికీ సమాధానాలు రాశావా?

రాము: మొదటి రెంటికీ, చివరి రెంటికీ తప్ప అన్నిటికీ రాశానమ్మా.

అమ్మ: ఇంతకీ ఎన్ని ప్రశ్నలిచ్చారు?

రాము: నాలుగు!




# కొత్తపల్లికో కథ



*రచన: ఏ.ఎస్. గీతిక, 8 వ తరగతి, జి.ప. ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

"వచ్చే సోమవారం మన బడికి కొత్తపల్లి కథల పుస్తకాల వాళ్ళు వస్తారు. పిల్లల చేత కథలు రాయిస్తారు. బాగున్న వాటిని కొత్తపల్లి పుస్తకంలో వేస్తారు. అందరూ చక్కని కథలు రాయటానికి తయారుకండి" అని హెడ్మాస్టరుగారు స్కూలు అసెంబ్లీలో ప్రకటించారు. అది వింటూనే పిల్లలందరూ ఎంత ఆనందపడ్డారో!

కొత్తపల్లికోసం ఈసారి ఒక మంచి కథ రాసి ఇవ్వాలని ఉంది రమేష్‌కు. వారం రోజులుగా ఆలోచిస్తున్నాడు, కథ కోసం. చాలా ఐడియాలు వచ్చాయి; కానీ దేనికీ మంచి ముగింపు రావటం లేదు. కథల నడక కూడా సరిగా ఉన్నట్లు లేదు. సోమవారం కథారచన కార్యక్రమం మొదలయ్యేటప్పటికి కూడా రమేష్ మనసులో కథ తయారు కాలేదు. మిగిలిన పిల్లలందరూ బాగా తయారై వచ్చినట్లుంది.. కొత్తపల్లి వాళ్ళు వచ్చారు.

కథలు రాయడంలో మెళకువలు చెప్పారు కొన్ని. పిల్లలతో కలిసి కూర్చొని అప్పటికప్పుడు కొన్ని కథలు సృష్టించారు. తరువాత టీచర్లు పిల్లలందరికీ తెల్ల కాగితాలు ఇచ్చి కథలు రాయమన్నారు. అందరూ హుషారుగా రాయడం మొదలుపెట్టారు..

కానీ రమేష్ కు ఒక్క కథ కూడా మనసులోకి రావడం లేదు. చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. బాగా ఆలోచిస్తే తప్పకుండా ఒక మంచి కథ దొరుకుతుంది...గట్టి నమ్మకంతో ప్రయత్నిస్తున్నాడు. టీచర్లు ఒకరి తరువాత ఒకరు అడుగుతున్నారు - "ఏం, నువ్వింకా మొదలు పెట్టనే లేదేం?" అంటున్నారు. "మంచి ఐడియా కోసం ఆలోచిస్తున్నాను సార్, కథ రెడీ అవుతానే రాసేస్తాను సార్" అని బదులిస్తున్నాడు..

సమయం గడచిపోతోంది..పిల్లలంతా కథలు రాసేసి టీచర్లకు ఇచ్చేస్తున్నారు. "ఇచ్చేసిన వాళ్ళు ఇళ్ళకు వెళ్ళి పోవచ్చు" అన్నారు హెడ్మాష్టరుగారు. "కథ రాయక పోయినా ఫర్వాలేదులే, నువ్వు ఖాళీ కాగితం ఇచ్చేసి వెళ్ళిపోవచ్చు" అని చెప్పారు టీచర్లంతా, రమేషుకు.

"లేదు సార్, నేను తప్పకుండా ఒక మంచి కథ రాసిన తర్వాతనే ఇంటికి పోతాను సార్" అని బదులిచ్చాడు రమేష్.

"కానీ మంచి ఐడియా ఏదీ, తట్టటమే లేదేం?" బడి మూసేసే టైమయింది. పిల్లలందరూ వెళ్ళి పోయారు. చాలా మంది టీచర్లు కూడా వెళ్ళిపోయారు.

"కొత్తపల్లివాళ్ళు రేపు ప్రొద్దున కూడా వస్తారు- నువ్వు రేపు రాద్దువులే, ప్రస్తుతానికి ఇంటికెళ్ళు" అని టీచర్లు, హెడ్మాష్టరు గారు ఎన్ని విధాలుగా చెప్పినా రమేష్ పట్టువదల్లేదు. "సార్, నేను కథ రాసిన తర్వాతనే ఇంటికి పోతాను. నాకొక మంచి ఐడియా వస్తా ఉంది. దాన్ని సరిగ్గా ముగించాలి సార్. చివర్లో ఇరుక్కు పోయింది. దాని చిక్కు తీస్తానే రాసేస్తాను సార్" అని పట్టు పట్టాడు.

ఇక లాభం లేదనుకొని, "సరేలే, మేం ఇంటికి వెళ్తున్నాం. నువ్వు కథ పూర్తి చేసి, ఆ కాగితాల్ని నా ఆఫీసు రూము కిటికీ గుండా లోపల పడేసి

ఇంటికి పో, జాగ్రత్త మరి!" అని చెప్పి హెడ్మాస్టరుగారు, టీచర్లు తమ ఇళ్ళకు వెళ్ళి పోయారు.

అందరూ ఇంటికి వెళ్ళిపోయినా, రమేష్ మాత్రం అట్టా-పేపరు ఒళ్ళో పెట్టుకొని కథ కోసం అలోచిస్తూనే ఉన్నాడు- ఎంత ఆలోచించినా మనసుకు నచ్చేట్టు ఒక్క కథా రావడం లేదు.

చీకటి పడుతోంది. రమేష్ గట్టివాడు. అతనికి చీకటంటే ఏమీ భయం లేదు. గ్రౌండులో అలాగే కూర్చున్నాడు. ఇంతలో వర్షపు చినుకులు మొదలయ్యాయి.. అయినా వాడు కదల్లేదు. ఉరుములు, మెరుపులు. వర్షం వేగం పుంజుకుంటోంది. రమేష్ లేచి హెడ్మాస్టరుగారి గది ముందు వసారాలోకి మారాడు. ఇప్పుడు వాడికి మొండితనం ఎక్కువయింది. "..చూద్దాం, మంచి కథ రాయడానికి ఎంత సేపు ఆలోచించాలో" అని అలాగే కూర్చున్నాడు.

ఇంతలో "ఘల్, ఘల్, ఘల్..." అని శబ్దం వినపడింది.

"..ఎక్కడినుంచి వస్తోందది?"

అదేదో తనవైపే వస్తున్నట్లు ఉంది.. నిదానంగా శబ్దం ఎక్కువవుతోంది..

ఇప్పుడు రమేష్‌కి కొంచెం కొంచెంగా భయం పుడుతోంది.. "దయ్యమేమో..! అయినా దెయ్యాలు, భూతాలు ఉండేది కథల్లోనే కదా?! అవి నిజంగా ఉండవు" అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు.

"ఘల్..ఘల్..ఘల్.." -శబ్దం మరింత దగ్గరకు వచ్చినట్లయింది.

చిమ్మ చీకటి! ఏమీ కనిపించడం లేదు! అప్పుడప్పుడు మెరుపులు! మెరుపుల వెలుగులో కూడా ఏమీ కనిపించడం లేదు. ఆగకుండా "ఘల్..ఘల్.." శబ్దం, అప్పుడప్పుడు ఉరుములు. వర్షం కురుస్తూనే ఉంది. నీళ్ళ జల్లు కొంచెం కొంచెంగా తనమీద పడుతూనే ఉన్నది!

అంతలో- ఆశ్చర్యం!! ఉన్నట్టుండి రమేష్ చేతిలోని పెన్ను కాగితం మీద రాయటం మొదలు పెట్టింది! అప్రయత్నంగా రాసేస్తున్నది చెయ్యి! 'ఎవరో తన చెయ్యి పట్టుకొని పేపరు మీద రాయిస్తున్నారా' అన్నట్లుంది. మొదట్లో

వాడికి భయం వేసింది. కానీ భయపడి ఏం ప్రయోజనం..?

కొంతసేపట్లోనే రమేష్‌కి ఇదంతా భలే గమ్మత్తుగా అనిపించసాగింది. అతని చెయ్యి రాసుకుంటూ పోతున్నది..ఒక పూర్తి కాగితం రాయడం అయిపోయింది..ఎలా తిరిగిందో మరి, కాగితం వెనక్కి తిరిగింది.. తను ఇప్పుడు ఆ కాగితం వెనకాల రాస్తున్నాడు..ఆ కాగితం అయిపోతూనే ఇంకో కాగితం..రమేషుకు ఇదంతా భలే తమాషాగా ఉంది. చెయ్యి రాస్తూనే ఉంది..ఏదో చక్కని కథ తయారౌతున్నట్లుంది..

"నాన్నా, రమేషూ, లేరా, స్కూలు టైమయిందిరా, తొందరగా నిద్రలేవరా" అని అమ్మ గట్టిగా అరవడంతో నిద్ర లేచాడు రమేష్.

"ఓహో! ఇదంతా కలా!?" అని ఒక్కసారిగా విచారం వేసింది. "అయితేనేం, దీన్నే నేను కథగా మారుస్తాను!" అని తన నోట్ బుక్ తీసి గబగబా రాయడం మొదలుపెట్టాడు.

అమ్మ సమయం గుర్తు చేసేసరికి తొందరగా స్నానం చేసి వచ్చి, మళ్ళీ రాసాడు. బస్సుకోసం ఎదురు చూస్తూ కొంత రాసాడు. బస్సులో కూడా కొంచెం రాసాడు. స్కూలు అసెంబ్లీ అయిపోగానే ఇంకొంచెం రాసి, కథను చక్కగా ముగించాడు. ఆ కాగితాలను హెడ్మాష్టరుగారి టేబిలు మీద పెట్టి, తన క్లాసు రూముకు పరిగెత్తాడు.



మరుసటి రోజు అసెంబ్లీలో, "రమేష్ ఒక చక్కని కథ రాసాడు, దాన్ని కొత్తపల్లికి పంపుతున్నాను, వాళ్ళు తప్పకుండా దాన్ని కొత్తపల్లిలో వేస్తారని అనుకుంటున్నాను" అని హెడ్మాష్టరుగారు చెప్పారు. రమేష్ ఎంత ఆనందించాడో! 

# పేరు వచ్చాక ఏమైంది?

(గతమాసం తరువాయి...)

అనురాగ్ గోదావరి, ఆరవ తరగతి


































రోజూ పళ్ళు తోముకోకపోతే ఎంత లాభం! :-))

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: శ్రీమతి జి.లలిత,* telugu4kids.com



ఈ బొమ్మను చూడండి. ఎవరు ఇది?

**కూర గణపతి!**

ఎవరో తయారు చేసి ఉంటారు కదూ, ఎందుకు చేశారో, కూరగాయలతో?

లేకపోతే గణపతే ఇలా వేషం వేసుకొని కూర్చున్నాడా?

మరి రంగు రంగుల ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ వినాయకుడు దొరకలేదో..?

నిమజ్జనం చేసి జల కాలుష్యాన్ని పెంచటం కంటే ఇది నయమనుకున్నారేమో, మరి!

ఈ కూరగాయల్ని ఆవులు ఎంచక్కా భోంచేస్తాయి గదా, మరి ఆవులన్నీ కలిసి ఇలా చేసుకున్నాయా?

దీని వెనక ఏదో ఒక కథ ఉండే ఉంటుంది.. మీ ఊహకీ అందుతుందేమో ఆ కథ, ప్రయత్నించి చూడండి! మాకు రాసి పంపండి; బాగుంటే ప్రచురిస్తాం.

మా చిరునామా: కొత్తపల్లి బృందం, యం.ఆర్.వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101,
ఫోన్లు: 08559 240222, 7702877670.



# కల

*కొత్తపల్లి పత్రిక ఆగస్టు సంచికలో ఇచ్చిన 'బొమ్మకు కథ రాయండి' కి వచ్చిన స్పందన ఇది..*
*రచన: కె.గంగమ్మ, ఉపాధ్యాయిని, ప్రకృతి బడి, చెన్నేకొత్తపల్లి.*

అనుకున్న విధంగానే తనూజ్, మనోజ్‌లు అమెరికా నుండి హైదరాబాదులో కాలు పెట్టారు. విమానం దిగగానే తాతయ్య, మామయ్య సిద్ధంగా ఉన్నారు. తాతయ్యను చూడగానే ఏనుగును ఎక్కినంత సంబరం అయింది వాళ్లకి. అందరూ అక్కడినుండి నుండి బస్సులో కర్నూల్‌కి చేరుకున్నారు. ఆసరికే పాలేరు కట్టుకొని వచ్చిన ఎద్దుల బండి నిలబడి ఉన్నది అక్కడ. ఆ బండి ఎక్కి అందరూ తాతయ్యగారి ఊరు- రావులపాళెంకు బయలుదేరారు. బండిలో ఎత్తుగా వరిగడ్డి పరిచి ఉంది. దాని మీద దుప్పటి- బండంతా మెత్తగా, చల్లగా ఉంది. అప్పటికి సాయం సమయం అయ్యింది కూడాను. బండి నెమ్మదిగా, ఉయ్యాల ఊగినట్లు సాగుతున్నది. దానికి

అనుగుణంగా ఎద్దుల మెడలో చిరు గంటలు గణగణమని మ్రోగుతున్నాయి.

బండిలో చాలా హాయిగా ఉంది. దోర జామ పండ్లు తింటూ, తాతయ్య చెప్పే కబుర్లకు ఊఁ కొడుతూ , మధ్య మధ్య ఎదురవుతున్న చింత తోపులను, తాటిదుబ్బలను చూసుకుంటూ, ఈత గుబుర్లలోంచి పారే వంకలను దాటుకుంటూ ప్రయాణం చేయడం భలే ఉంది!

ఇంకా ఊళ్ళోకి చేరకనే తాతయ్య గారిల్లు వచ్చేసింది. బండి నెమ్మదిగా ఇంటిముందు ఆగింది. ఇంట్లోంచి అమ్మమ్మ హడావిడిగా బయటికి వచ్చి ఇద్దరినీ ముద్దు పెట్టుకొని లోపలికి తీసుకొని పోయింది.

అమ్మమ్మ ఇల్లు భలే బాగుంది. అచ్చం వాళ్ళు డ్రాయింగ్‌లో వేసే బొమ్మ ఇల్లులాగా ఉంది. పెద్ద స్థలానికి ఒక వైపున చక్కని ఇల్లు. ఇంటి ప్రక్కనే ఒక చెరువు! వెనక ప్రక్కన దూరంగా కనబడుతున్న కొండలు! చిన్నగా ఉన్నప్పటికీ అందంగా, పొందిగ్గా ఉంది ఇల్లు. ఇంట్లో ఎటువంటి పెద్దపెద్ద సామానులూ లేవు. 'ఇలా వీళ్ళు ఎలా బ్రతుకుతారబ్బా' అనుకుంటూ ఉండగానే, "రండిరా స్నానం చేద్దురు!" అంటూ అమ్మమ్మ కేక వేసింది.



గోరు వెచ్చటి నీటితో ఆరుబయట బండమీద స్నానం చేయటం బలే తమాషాగా ఉంది. తరువాత అందరూ కలసి భోజనం చేశారు. వేడి వేడి అన్నం, ముద్దపప్పు, గుత్తి వంకాయ కూర , గుమ్మడి వడియాలు, గోంగూర పచ్చడి, కాకర కాయ వేపుడు, ఆవకాయ, గడ్డపెరుగుతో భోజనం ముగించే సరికి భుక్తాయాసం అయింది. ఇంత మంచి

రుచికరమైన భోజనం ఎప్పుడూ చెయ్యలేదు.. అమ్మమ్మ చేతి వంట నిజంగా అమృతంలాగా ఉంది. తరువాత ఆరుబయట మంచాలు వేసుకొని అందరూ పడుకున్నారు. ఇంతలో పాలేరు రంగయ్య వచ్చాడు; ఎద్దులను కట్టేసి వచ్చి, తాతయ్యతో మాట్లాడుకుంటూ కూర్చున్నాడు.



చల్లటి గాలిలో పడుకున్న మనోజ్,తనూజ్‌లు ఆకాశం కేసి చూస్తూ ఉన్నారు:

"నిజంగా ఎంత బాగుంది, ఇక్కడ! వెన్నెల వెలుగులో మునగ చెట్టు బంగారు రంగులో మెరిసిపోతూ ఉంది. మడుగులోని నీళ్లలో చంద్రుడి వెన్నెల పడి వింత కాంతులను వెదజల్లుతోంది. పూల వాసనను మోసుకొస్తున్న గాలి అలా అలా నెమ్మదిగా వీస్తోంది. ఆకాశంలో మబ్బులు వింత వింత ఆకారాలలో కదులుతూ "మా వెంట రండి" అని పిలుస్తున్నాయి..."

"రేయ్ ...తనూ, మనూ ! 'గెట్ అప్ ప్లీజ్' అని మమ్మీ పిలిచిన పిలుపుకు ఇద్దరూ ఒకే సారి అదిరి పడి దిగ్గున లేచారు.

చూడగా ఇంకా అమెరికాలోనే ఉన్నారు. "అబ్బా!.. ఇంతసేపు కన్నది కలా?! ఎంత బాగుంది! అమ్మ చెప్పినట్లు, ఈ సారి వేసవి సెలవులలో తాతయ్య వాళ్ళ ఊరికి తప్పకుండా వెళ్ళాలి!" అనుకుంటూ బడికి తయారయ్యేందుకు గబగబా లేచారు. ✿



# సహాయం



*మూలం : తబ్బిబ్బు మహానందప్ప, విశ్రాంత ఉపాధ్యాయులు, మైదుకూరు, కడప జిల్లా.*
*మార్పు చేర్పులు : కొత్తపల్లి.*

ఎప్పటిలాగే ఆ రోజు కూడా పిల్లలంతా బిలబిలమంటూ తాతయ్య చుట్టూ చేరి, కథ చెప్పమని అడిగారు. తాతయ్య మెల్లగా గొంతుసవరించుకున్నాడు. "అబ్బా! వినండర్రా, గోలచేయకండి మరి" అంటూమొదలుపెట్టాడు.

దసరా నవరాత్రుల సమయం. ఊరంతా సందడిగా ఉంది. అందరి మొహాల్లో ఆనందం. అయితే ఊరికి ఒక చివరన నివసించే గంగయ్య మాత్రం దిగాలుగా ఉన్నాడు. అతనికి ఒక మనుమడు ఉన్నాడు-చంద్రం. ఆ పిల్లాడి అమ్మానాన్నలు మొన్నటి వరదల్లో కొట్టుకుపోయారు. పండగరోజుల్లో ఆ పిల్లవాడిని చూసుకొని

విచార పడుతున్నాడు గంగయ్య. 'తనా వయస్సు పైబడినవాడు- ఈ వయస్సులో వీడినెట్లా సాకాలి?' అని ఆవేదన చెందుతున్నాడు.

గంగయ్య వయసులో ఉన్నప్పుడు మేస్త్రీ పని చేసేవాడు. ఆ రోజుల్లో ఇళ్ళు కట్టాలంటే 'ఎవర్ని పిలవాలి' అన్న ప్రశ్నే ఉండేది కాదు- ఊళ్ళో ఏ ఇల్లు కట్టాలన్నా గంగయ్య మేస్త్రీనే. మేస్త్రీ పనిలో గంగయ్య బాగా సంపాదించేవాడు. అయితే ఏనాడూ ఒక్క పైసా కూడబెట్టిన పాపాన పోలేదు- బీడీలలోను, సిగిరెట్లలోను, పేకాటలోను, సారాయిలోను ఆ డబ్బు మొత్తాన్నీ తగలేసేవాడు. కాలం గడచేకొద్దీ కొత్త మేస్త్రీలు పుట్టుకొచ్చారు. ప్రమాదంలో పైనుండి క్రింద పడ్డ గంగయ్య కుంటివాడయ్యాడు. క్రమేణా అతన్ని పనికి పిలిచేవాళ్ళు తగ్గిపోయారు. అందరికీ ఇళ్ళు కట్టించిన గంగయ్యకు ఇల్లే కాదు; తినేందుకు తిండీ కరువైంది. అప్పటికే హాస్టలులో ఉండి చదువుకుంటున్న కొడుకు అంది వస్తాడనుకున్నాడు గంగయ్య. వాడు నిలదొక్కుకున్నట్లే నిలదొక్కుకున్నాడు- ఇప్పుడు ఇదిగో, ఈ పిల్లవాడిని తనమీద వదిలేసి వెళ్ళిపోయాడు. ఆ పిల్లవాడి భవిష్యత్తును తలచుకొని ముసలి గంగయ్య కుమిలిపోతున్నాడు.

భైరవాపురంలోనే రామయ్య-సోమయ్య అనే ఇద్దరు స్నేహితులు ఉండేవాళ్ళు. చిన్ననాటి నుంచీ ఏ పనైనా కలిసి చేసుకొనేవాళ్ళు వాళ్ళు. ఇప్పుడు ఇద్దరూ పెద్దవాళ్లయ్యారు, స్థితిమంతులయ్యారు. జీవితంలోని ఆటుపోట్లన్నీ ఎదుర్కొని ఉన్నారు. పదిమందికి పనికొచ్చే పనులు చెయ్యటమంటే ఇద్దరికీ ఇష్టం. దసరా పండుగ రోజున ఘనంగా దేవీ పూజ జరిపి ఊరంతటినీ పిలిచి విందు చేయాలని అనుకుంటున్నారు ఇద్దరూ.

అదాటుగా అటు పోతున్న సోమయ్యకు కనబడ్డాడు గంగయ్య. సోమయ్య మొదటి ఇంటిని కట్టింది గంగయ్యే. "ఏం గంగయ్యా?! ఎట్లా ఉన్నావు? కాలికి దెబ్బ తగిలాక పని తగ్గించుకున్నట్లుందే? అస్సలు కనబడటం లేదు. ఈ పిల్లాడెవరు? నీ కొడుకు ఏం

చేస్తున్నాడు?" పలకరించాడు సోమయ్య.

గంగయ్య కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు. "నాదేముంది, ఎలాగో ఒకలాగా బ్రతికేస్తాను. ఈ చంద్రం గురించి ఆలోచిస్తేనే, దిగులు వేస్తోంది" అన్నాడు తన పరిస్థితిని వివరించి.

గంగయ్య కథ సోమయ్యను ఆలోచనలో పడేసింది. 'భగవంతుడి పేరిట తనూ, రామయ్యా చేసే ధర్మకార్యాలు చాలా ఉన్నై. కానీ తోటి మనిషికి నేరుగా సాయపడే పనులు ఎందుకు చేపట్టకూడదు తాము? గంగయ్యలాంటి ముసలివాళ్లకి, చంద్రం లాంటి పిల్లలకీ పనికి వచ్చేట్లు ఏదైనా చేయగలిగితే బాగుండు గదా?' అనుకున్నాడు.

వెళ్లి రామయ్యకు, తమ కుటుంబాలలోని వాళ్లకు విషయం చెప్పాడు. "నిజమే, ఇన్నాళ్ళూ దేవుడి పేరిట మనం చాలా మంచిపనులు చేశాం. ఇప్పుడు మనం కష్టాలలో ఉన్నవాళ్లకు నేరుగా పనికివచ్చేట్లు ఏమైనా చెయ్యాలి" అన్నాడు రామయ్య. "అవునండీ, దసరా తర్వాత ఊరంతటికీ ఒక రోజు విందు చేసే బదులు, ఆ డబ్బుతో గంగయ్యకు, చంద్రానికీ ఇద్దరికీ ఉపాధిమార్గం చూపచ్చు" అన్నది సోమయ్య భార్య. వాళ్ల పిల్లలకీ ఆ ఆలోచన నచ్చింది.

మరునాడే రామయ్య-సోమయ్య ఇద్దరూ గంగయ్య దగ్గరికి వెళ్ళారు. అతన్ని, చంద్రాన్ని తమ వెంట పిలుచుకొని వచ్చారు. గంగయ్యకు తాళ్ళు పేనటం వచ్చు. "మేం ఇద్దరం ఇప్పుడు తాళ్ళ వ్యాపారంలోకి దిగుదామనుకుంటున్నాం గంగయ్యా, నువ్వు మాకు తాళ్ళు పేని ఇవ్వాలి. నీకు మేం నెలకు ఇంత అని ఇస్తుంటాము, అట్లాగే చంద్రానికి చదువూ చెప్పిస్తాం- అయితే ఒక్కటే షరతు- నువ్వు తాగుడుకు, పేకాటకు దూరంగా ఉండాలి" అన్నారు రామయ్య సోమయ్యలు. "నేను అవి మానేసి చాలా కాలం అయ్యిందయ్యా, తాళ్లు మీకు ఎన్ని కావాలంటే అన్ని పేనిస్తాను-దానిదేముంది" అన్నాడు గంగయ్య ఉత్సాహంగా.

విజయదశమినాటికి గంగయ్య పేనిన తాళ్ళు, తలుగుల అమ్మకాలు మొదలు పెట్టారు

రామయ్య-సోమయ్య. గంగయ్యకు ఇప్పుడు ప్రతివారమూ 'ఇంత' అని ఆదాయం వస్తున్నది. చంద్రయ్య బడికి పోయి చదువుకోవటం మొదలుపెట్టాడు. సహజంగా చురుకైన పిల్లవాడేమో, ఒక నెలలోగా వాడు ఉపాధ్యాయులందరికీ ప్రియ శిష్యుడు అయిపోయాడు. రామయ్య-సోమయ్యలు వాళ్లమీద పెట్టిన ఖర్చుకి, గంగయ్య తయారు చేసే తాళ్ళ విలువకు మొదట్లో ఏమాత్రం పొంతన ఉండేది కాదు- కానీ ఇరు కుటుంబాలకూ తెలుసు-'ఇది ఒక సామాజిక కార్యం. ఇందులో ఉన్నదంతా లాభమే- నష్టం అన్న ప్రసక్తే ఉండదు. ఈ పని ద్వారా ముసలి గంగయ్యకు కాలక్షేపం, చిన్నోడు చంద్రానికి విద్యాబుద్ధులు- లభిస్తాయి. దానికోసం కొంత డబ్బు, కొంత సమయం వెచ్చిస్తున్నాం మనం' అని.

అయితే మరి రెండేళ్లలో ఈ పనీ విస్తరించింది. ఇప్పుడు రామయ్య చంద్రయ్య కుటుంబాల నీడన ఒక వృద్ధాశ్రమం, ఒక హాస్టలు నడుస్తున్నాయి. రామయ్య-సోమయ్యలేకాక, అనేకమంది సహాయం అందిస్తున్నారు వాటికి. వృద్ధాశ్రమంలో గంగయ్యతోబాటు చాలామంది ముసలివాళ్ళు ఉన్నారు. ముసలి- వాళ్ళు తమకు చేతనైన పనులు చేస్తున్నారు. హాస్టలులో ఉన్న పిల్లలంతా వాళ్ల శక్తి కొద్దీ చదువుతున్నారు. అందరూ సంతోషంగా ఉన్నారు.

చంద్రయ్య పెద్దయ్యాక, అతనే ఆ సంస్థను నడిపించటం మొదలుపెట్టాడు. తను పుట్టి-పెరిగిన ఊరికి, తనను ఆదరించిన వారికి మంచి పేరు తెచ్చేట్లు పని చేశాడు. వాళ్ల ఊరు ఈనాడు ఒక ఆదర్శ గ్రామం .

"కథ విన్నారుగా, మీరు కూడా చంద్రయ్య లాగా ఆదర్శవంతులు కావాలి మరి!" అని తాత కథ ముగించాడు.

పిల్లలంతా ఉత్సాహంగా కథ విన్నారు.

సురేష్ ఇంకా ఏదో అడగబోతుంటే "పదండర్రా, ఇప్పుడు పోయి నేను చెప్పిన ఈ కథ గురించి బాగా ఆలోచిస్తూ పడుకోండి" అని లేచాడు తాతయ్య.





# రాజు - మాంత్రికుడు

*రచన: శ్రీమతి రాధ మండువ, ఋషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

పూర్వం ఒకప్పుడు కోసల దేశాన్ని విశాలుడు అనే రాజు పరిపాలించేవాడు. అతనికి ఏడుగురు కొడుకులు. రాజుకు, రాణికి వాళ్లంటే ప్రాణం. అయితే తమకు ఒక్క కూతురుకూడా లేదని కొంత అసంతృప్తి ఉండేది రాణీ గారికి.

ఇలా ఉండగా ఏడుగురు కొడుకులూ ఒకరోజున రాజ్యానికి సరిహద్దులలో ఉన్న అడవికి వేటకని వెళ్ళారు. సాయంత్రం అయింది... చీకటి పడింది. అయినా వాళ్ళు నగరానికి తిరిగి రాలేదు. ఆ రాత్రి వాళ్ల కోసం అందరూ ఎదురు చూశారు. ఇక తట్టుకోలేక, వేకువఝామున్నే తన కుమారులను వెతకడానికి మంచి గుర్రం ఎక్కి స్వయంగా బయలుదేరాడు విశాలుడు.

పిల్లలను వెతుకుతూ ఆరోజు సాయంత్రం వరకూ ఆగకుండా అడవుల్లో ప్రయాణించాడు అతను. అడవి మధ్యలో అకస్మాత్తుగా అతనికి ఎదురు వచ్చిందొక అవ్వ! నిర్జనమైన మహారణ్యంలో భయంలేకుండా తిరుగుతున్న

ఆ ముసలమ్మను చూసి రాజు ఆశ్చర్యంతో "ఎవరు అవ్వా నువ్వు? ఇక్కడ ఏం చేస్తున్నావు? మా కుమారులు ఏడుగురు, నిన్న అనగా ఈ అడవిలోకి వచ్చారు. వాళ్ళేమైనా కనబడ్డారా, నీకు?" అని అడిగాడు.

"రాజా! నేను నీకు సహాయం చేయాలనే వచ్చాను. నీ కుమారులు నీకు తప్పకుండా దొరుకుతారు. ఇదిగో! ఇది మాట్లాడే చిలుక. ప్రయాణంలో నీకు విసుగు కలగకుండా కబుర్లు చెప్తుంది. అంతేగాక నీకు ప్రమాదం జరగబోతుందనుకుంటే నిన్ను తన ముక్కుతో పొడిచి మరీ హెచ్చరిస్తుంది" అని చెప్పి చిలుకను రాజుకు ఇచ్చింది అవ్వ. విశాలుడు ఆమెకి నమస్కరించి గుర్రం ఎక్కుతుండగా - "ఉండు రాజా! తొందరపడకు. ఇకనుండీ నువ్వు నిదానంగా ఆలోచించి పనులు చేసుకోవాలి. ఇవిగో మూడు రాళ్ళు. మొదటి రాయిని విసిరేస్తే నిప్పును, రెండవది నీటినీ, మూడవది మొసలినీ పుట్టిస్తుంది. అవసరమైనపుడు ఈ వస్తువుల్ని వాడుకో" అని చెప్పి రాజుని దీవించి పంపిందామె. ఆమెకు మరోసారి నమస్కరించి రాళ్ళను జాగ్రత్తగా తన అంగీలో దాచుకొని, ప్రయాణం మొదలు పెట్టాడు విశాలుడు. చిలుక ఎగిరి వచ్చి అతని భుజం మీద కూర్చున్నది.

నిండా చీకట్లు అలుముకుంటున్నాయి. రాజు పూర్తిగా అలిసిపోయాడు. కానీ పిల్లల జాడ తెలియలేదు. పట్టు వదలకుండా ముందుకు వెళుతున్న రాజుకి దూరంగా ఒక తెల్లని భవనం కనిపించింది. రాత్రికి అక్కడ తల దాచుకుని, ఉదయాన్నే తన కుమారులను వెతకవచ్చుననుకుని ఆ భవనం వైపుకి తన గుర్రాన్ని దౌడు తీయించాడు విశాలుడు. అప్పటి వరకూ ఏవేవో మాట్లాడుతున్న చిలుక, భవనాన్ని చేరగానే మాట్లాడటం ఆపేసింది!

భవనం ప్రక్కగా గుర్రాన్ని కట్టి వేసి, ద్వారం దగ్గరకు వెళ్ళాడు రాజు. కీచురాళ్ళ శబ్దం, గబ్బిలాల ధ్వని తప్ప అక్కడంతా నిశ్శబ్దంగా ఉంది..

"లోపల ఎవరైనా ఉన్నారా?" అరిచాడు విశాలుడు. బదులుగా లోపల్నుంచి శబ్దాలు

వినబడ్డాయి. కొద్ది క్షణాల్లో తలుపులు తెరుచుకుని ఒక ముసలివాడు వచ్చాడు లోపలినుండి. విశాలుడు తను ఎందుకు వచ్చాడో చెప్పాడు. రాత్రికి అక్కడ ఉండటానికి అనుమతి అడిగాడు.

"అయ్యో! ఈ దేశాన్ని ఏలే రాజు నన్ను అనుమతి అడగడమా!? ఇది మీ ఇల్లే అనుకోండి. రండి!" అని నవ్వుతూ విశాలుడిని లోనికి ఆహ్వానించాడు ముసలివాడు.

నిజానికి వాడు ఒక మాంత్రికుడు. అర్థరాత్రి దాటాక రాక్షసుడి రూపం ధరించి, ఆ అడవిలోని జంతువులను, దారి తప్పి వచ్చిన మనుష్యులను పీక్కు తింటూ ఉంటాడు వాడు. ఆ రోజు ఉదయమే వాడికి ఏడుగురు రాజకుమారులూ దొరికారు. అయితే అప్పటికే వాడికి కడుపు నిండి ఉండటం చేత, రాజకుమారులనెవ్వరినీ ఇంకా తినలేక పోయాడు. రోజుకొకరిని చొప్పున మెల్లగా తినచ్చులెమ్మని, వాళ్లందరినీ వాడే ఓ పెద్ద పెట్టెలోపెట్టి బంధించి ఉంచాడు ! "ఆహా! ఈ రోజు ఎంత సుదినం! మళ్ళీ ఇంకో మనిషి దొరికాడు. అర్థరాత్రి దాటేలోపు వీడిని మాయచేసి పెట్టెలో పడేట్లు చేయాలి!" అనుకున్నాడు వాడు, రాజుని చూడగానే.

ఎక్కడలేని గౌరవాన్నీ ప్రదర్శిస్తూ రాజుని లోపలకి తీసుకెళ్ళి, తినడానికి పండ్లు వగైరాలు పెట్టాడు వాడు. "మహారాజా! అదిగో, ఆ మంచం మీద విశ్రాంతి తీసుకోండి. నాకు నిద్ర ముంచుకొస్తోంది " అంటూ వాడు చాప వేసుకుని పడుకున్నాడు.

బాగా అలసిపోయిన రాజుకూ నిద్రవస్తున్నది. పడుకునేందుకు గాను ఆ మంచాన్ని చేరబోయాడు. అంతలో చిలుక ప్రమాదాన్ని హెచ్చరిస్తూ రాజుని ముక్కుతో పొడిచింది. దాంతో విశాలుడు "తర్వాత పడుకుంటానులే తాతా! నువ్వు పడుకో!" అన్నాడు, తను దగ్గర్లోనే ఉన్న ఓ కుర్చీలో కూర్చుంటూ.

కొంతసేపటికి మాంత్రికుడు గుర్రుపెట్టి నిద్రపోవడం గమనించిన చిలుక "రాజా! ఆ మంచానికి నులక అల్లలేదు. దుప్పటి మాత్రమే పరిచి ఉంది. కూర్చోగానే మంచం

క్రింద ఉంచిన మాయా పెట్టెలో పడిపోతావు. వీడొక మాంత్రికుడు. అర్థరాత్రి దాటిందంటే రాక్షసుడిగా మారిపోతాడు. రకరకాల మాయలతో నీ బిడ్డలను ఆ మూలనున్న పెట్టెలో బంధించాడు. ఆ పెట్టెను పగలగొట్టి, వాళ్ళను తీసుకుని త్వరగా ఇక్కడ నుండి బయట పడాలి" అంది విశాలుడి చెవిలో, గుసగుసగా.

రాజు గబుక్కున మంచం క్రిందికి చూశాడు. మాయా పెట్టె అక్కడే ఉంది. రాజు శబ్దం చేయకుండా ఆ పెట్టెను ఎత్తుకొని బయటికి నడిచాడు. కొంచెం దూరం వెళ్ళాక రాయి ఒకటి తీసుకొని ఆ పెట్టెను పగలగొట్టి చూస్తే ఏముంది? రాకుమారులందరూ నిశ్చింతగా పడుకొని నిద్రపోతున్నారందులో! విశాలుడు త్వరత్వరగా కుమారులను నిద్ర లేపాడు. అందరూ ఇంటివైపుకు పరుగు తీయడం మొదలుపెట్టారు.

అంతలో అర్థరాత్రి అయింది. ఒళ్ళు విరుచుకుని నిద్రలేచాడు మాంత్రికుడు. వికృత రూపాన్ని ధరించాడు. పెట్టెలో ఉన్న ఎనిమిది మందిని తలుచుకుంటే వాడికి నోరు ఊరినట్లయింది. కండలు తిరిగి బలంగా ఉన్న రాజుని ముందుగా తినేద్దామని పించించి వాడికి. మెల్లగా వంగి మంచం కింద వెతికాడు. అక్కడుండాల్సిన పెట్టె ఏది? పెట్టె మాయం; తను వారం రోజులకుగాను ఇష్టంగా దాచుకున్న ఆహారమూ మాయం!

ఇదంతా విశాలుడు చేసిన పనేనని అర్థమైంది వాడికి. విశాలుడొక్కడే పోయి ఉంటే ఏమీ పరవాలేదు- అతనితోబాటు తను కష్టపడి సంపాదించుకున్న ఏడుగురు రాజ-కుమారులూ తప్పించుకున్నారని వాడికి విపరీతమైన కోపం వచ్చింది. క్రూరంగా అరుస్తూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వాళ్ళ వెంట పడ్డాడు. రాజు, రాజ కుమారులు ఎంత వేగంగా పరుగులు తీసినా, వాడు వాళ్ళను పట్టుకునేంత దగ్గరగా వచ్చేశాడు!

"మహారాజా! రాయిని విసరండి!" అంది చిలుక. తన అంగిలో దాచుకున్న రాళ్ళల్లో మొదటిదాన్ని గురిచూసి మాంత్రికుడిపై విసిరాడు రాజు. అది మంటలను

పుట్టించింది. అయినా వాడు మంటలను దాటుకుంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వస్తున్నాడు. రాజు రెండవ రాయిని విసిరాడు. లోతైన నీళ్ళ అగాథం ఏర్పడింది. వాడు నీళ్ళలో నుంచి కూడా రావడం చూసిన రాజు మూడవ రాయిని విసరగానే, పే..ద్ద మొసలి పుట్టింది- మాంత్రికుడిని గుటుక్కున మింగేసింది అది!

మరుక్షణం వాళ్లముందు ప్రత్యక్షమైంది అవ్వ. అవ్వ శరీరం బంగారు కాంతితో మెరిసిపోతున్నది. అదే సమయానికి చిలుకకాస్తా ఒక అందమైన పాప రూపు దాల్చింది. "రాజా! నీ చేత హతమైన మాంత్రికుడు వేరెవరో కాదు; నా కుమారుడే. చిలుకగా నీకు సాయం చేసింది నా మనుమరాలు.

దురాశ ఎక్కువై, చెడు దారి పట్టి, లోకకంటకుడిగా మారాడు నా కుమారుడు. నా అంతట నేను వాడిని ఏమీ చేయలేకపోయాను; కానీ ఈ పాపను మటుకు వాడి బారిన పడకుండా దూరంగా ఉంచి సాకుతూ వచ్చాను ఇన్నాళ్ళూ. ఇంక నేను ప్రశాంతంగా తపస్సు చేసుకుంటాను. నీకు అభ్యంతరం లేకపోతే, ఈ పాప బాధ్యత కూడా ఇకమీద నీకే ఇవ్వాలని ఉంది. నీ కుమారులకూ ఓ చెల్లి దొరికినట్లు అవుతుంది..ఏమంటావు?" అన్నది అవ్వ, రాజుతో.



రాజు, రాజకుమారులవైపు చూశాడు. రాజకుమారులు నవ్వుతూ చెల్లి చెయ్యి పట్టుకున్నారు. సంతోషంతో అవ్వ ముఖం వికసించింది.

అందరూ రాజ్యాన్ని చేరుకున్నారు. రాణిగారికి ఒక చక్కని కూతురు దొరికింది. చిలుక చెల్లికి ఏడుగురు అన్నలు దొరికారు! 

# చిలిపి ప్రశ్నలు-అల్లరి జవాబులు

*నిర్వహణ: శ్రీవి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ.*

1.కొడుకు డాక్టరవుతాడని తల్లిదండ్రులకు అనుమానం ఎప్పుడొస్తుంది?

జవాబు: తోడబుట్టిన చెల్లెల్ని వాడు "సిస్టర్, సిస్టర్" అని సంబోధిస్తున్నప్పుడు.

2.తెలుగు,తెలుగు కలుసుకుంటే మొదట ఏమొస్తుంది?!

జవాబు: "గుడ్ మార్నింగ్"!!

3.హోటల్ కెళ్ళిన జడ్జిగారికి ఒళ్ళు మండేదెప్పుడు!?

జవాబు:బేరర్ వచ్చి "ఆర్డర్, ఆర్డర్!" అన్నప్పుడు.

4.'భిన్నత్వంలో ఏకత్వం'-ఒక ఉదాహరణ చెప్పండి?

జవాబు:వివిధ మతాలు, జాతులు, ప్రాంతాలు కలిగిన మన దేశంలో 'అవినీతి' మాత్రం ఒక్కటే!

5. మడమ తిప్పితే ఏమవుతుంది?

జవాబు:'మడమ'

6. ఎం.ఎల్.ఏలకు అసెంబ్లీలో ప్రవేశించే ముందు 'ఎంట్రన్స్ పరీక్ష' పెడితే ఏమవుతుంది?

జవాబు: ముందుగా పేపరు లీకవుతుంది!!

7.బాల్యం.....యవ్వనం......వృద్ధాప్యం....ఇదే క్రమంలో వచ్చేవి ఏవి?

కార్టూన్లు....సినిమాలు.....సీరియళ్లు.

8.డాక్టరు నిర్ఘాంతపోయేదెప్పుడు!?

జవాబు:'షుగర్ మానేసి బెల్లం వాడొచ్చా డాక్టర్?' అని పదేళ్ళుగా మందులేసుకుంటున్న షుగర్ పేషెంట్ అడిగినప్పుడు!!

# మంచి పని

కథనం: నారాయణ, కొత్తపల్లి బృందం.

బొమ్మలు: అడవి, జెయన్‌టీయూ ఫైన్ ఆర్ట్స్ కళాశాల, హైదరాబాదు



టీచర్: పిల్లలూ! రేపు బడిని చూసేందుకు డియీవో గారు వస్తున్నారు. అందరూ చక్కగా తయారై, త్వరగా బడికి రండి. సరేనా?



రాబర్ట్: అయ్యో! ఎవ్వరో ముసలాయన! మోటారు సైకిలువాడు గుద్దేసి వెళ్తున్నాడు. పద, పోయి సాయం చేద్దాం, ఆ తాతకి!

సోము: వద్దులేరా, మనం పోదాం. తొందరగా బడికి వెళ్ళాలి..ఇవాళ్ల డియీవో గారు వస్తున్నారు కదా!



రాబర్ట్: నేను ఈ తాతకు కొంచెం సాయం చేసి వస్తాను. కావాలంటే నువ్వు బడికి పో. టీచరు గారు నా గురించి అడిగితే కొంచెం ఆలస్యంగా వస్తానని చెప్పు.



రాబర్ట్: (గంటసేపటి తర్వాత) నేను లోపలికి రావచ్చా మేడం?

డియీవో: (కోపంగా) ఎందుకు, ఆలస్యంగా వచ్చావ్? రోజూ ఇంతేనా?



రాబర్ట్: రోజూ టైంకి వచ్చేస్తాను మేడం! అయితే ఇవాళ్ల వస్తూంటే రోడ్డు మీద ఒక ముసలాయన క్రింద పడిపోయాడు. చాలా రక్తం కారుతున్నది, ఆయన్ని లేపి, ఆస్పత్రిలో చేర్చి వచ్చే సరికి ఇంత సమయం అయ్యింది.



డియీవో: ఓ! నువ్వేనా ఆ బాబువు! నేను కారులో వస్తూ చూశాను. ఎవరో మంచి కుర్రాడే అనుకున్నాను. శభాష్! అందరు పిల్లలూ నీ నుండి నేర్చుకోవాలి.

# విలియం కంక్వంబా

యువ కెరటాలు-1

## గాలితో విద్యుత్తు తెచ్చిన అబ్బాయి

*విలియం కంక్వంబా కు ఇప్పుడు 22 ఏళ్ళు. ప్రపంచం లోని ఎందరో మేధావులు సాంకేతికత గురించి, దాని సామాజిక ఉపయోగాల గురించి ప్రసంగించే TED కాన్ఫరెన్సులో తన విజయగాథ గురించి ప్రసంగించాడు విలియం! అసలు ఎవరితను? ఏం చేశాడు? అతనికి ఇంత చిన్నవయసులోనే ఇంత పేరు ఎందుకొచ్చింది? చదవండి..*

*నిర్వహణ: వి.బి.సౌమ్య, పుస్తకం.నెట్*





ఆఫ్రికా ఖండంలో 'మలావీ' అనే చిన్న దేశం ఒకటుంది. ప్రపంచంలోని చాలా పేద దేశాల్లో అదీ ఒకటి. ఆ దేశంలో ఒక చిన్న ఊరిలో విలియం కంక్వంబా ఉండేవాడు. వాళ్ళది ఒక మామూలు రైతు కుటుంబం. పదేళ్ళ క్రితం మాలావీ దేశంలో వచ్చిన కరువు- దాని తరువాత వచ్చిన కుటుంబ కష్టాల వల్ల, అప్పటిదాకా బడిలో చదువుకుంటున్న విలియం ఇక డబ్బుల్లేక స్కూల్ మానేయాల్సి వచ్చింది. అలా అక్కడ చదువు మానేసిన వాడు మరో ఐదేళ్ళ దాకా బడికి వెళ్ళలేక పోయాడు. ఇంట్లో అందరూ కలిసి వ్యవసాయం పనులు చేసుకుంటూ వచ్చారు.



అయితే, ఈ కష్టాలేవీ విలియంను నిరాశ పరచలేదు. అతనికి వీలైనప్పుడల్లా వాళ్ళ ఊళ్లో ఉన్న గ్రంథాలయానికి వెళ్లి అక్కడ సైన్సు పాఠాలు సొంతంగా చదువుకుంటూ వచ్చాడు. ఒకరోజున అతనికి శక్తిని ఎలా వినియోగించుకోవచ్చో తెలియజేసే పుస్తకం ("Using Energy"అనేది)ఒకటి దొరికింది. గాలిమరలతో విద్యుత్తును ఎలా తయారు చెయ్యొచ్చో బొమ్మలతో సహా వివరించి ఉంది

అందులో!

ఆ పుస్తకాన్ని చదివాక ఇక విలియం ఆగలేకపోయాడు. తనుకూడా అలాంటిది ఒకటి తయారు చేయాలనుకున్నాడు. అంతవరకూ వాళ్ళ ఇంట్లో కిరోసిన్ దీపాలే వాడేవాళ్ళు. ఆ ఊళ్లో విద్యుత్తు ఉన్న ప్రాంతాలు తక్కువ. అసలు మాలావీ దేశం మొత్తంలోనూ విద్యుత్ సరఫరా అందే ప్రాంతాలు రెండు శాతమేనట! అలాంటి చోట మరి, సొంతంగా కరెంటును ఉత్పత్తి చేసుకుంటే ఎంత గొప్పగా ఉంటుంది!!



సరే, తను పుస్తకంలో చదివిన దాన్ని తయారు చేయాలంటే, ఎంత లేదన్నా కొన్ని పరికరాలు కావాలి కదా? మరి, వాటిని కొనేందుకు డబ్బు కూడా అవసరమౌతుంది! కానీ, విలియం దగ్గర డబ్బులు ఏమున్నాయి గనక? అందుకని వాళ్ల ఊళ్ళో పనికిరాని వస్తువుల్ని పడేసే చోటుకి వెళ్ళి తన పనికి ఉపయోగపడే వస్తువుల్ని వెతుక్కున్నాడు- పాడైపోయిన ఒక ట్రాక్టరు ఫ్యాను, పనిచెయ్యని ఓ షాక్ అబ్సార్బరు, బాగున్న ఒక సైకిలు ఫ్రేము, ప్లాస్టిక్ పైపులు, సైకిల్ డైనమో, పాత చెక్కముక్కలు, వాళ్ల ఊళ్ళో పెరిగే ఒక రకం వెదుర్లు- ఇవన్నీ దొరికాయి! వీటిని ఉపయోగించాడు. ప్లాస్టిక్ వస్తువుల్ని కరిగించి గాలిమర రెక్కలకు ఓ రూపం తెచ్చాడు. వెదుళ్లతోటీ, చెక్క ముక్కలతోటీ ఎత్తైన మంచె ఒకటి తయారు చేశాడు. సైకిలు ఫ్రేమును దానిపైకి ఎక్కించి, దానిలోని గేర్ల వ్యవస్థను వాడుకున్నాడు. చివరికి గాలి రాగానే తిరిగేలా ఒక నిజం గాలిమరను తయారు చేసాడు! ఆ గాలిమర సైకిల్ డైనమోని తిప్పగానే తన గదిలో బిగించిన లైటు వెలిగింది!

ఇక దానికి ఒక కారు బ్యాటరీని బిగించాడు; గాలి లేనప్పుడూ ఇంట్లో విద్యుత్ సరఫరా నిలచిపోకుండా చేయగల్గాడు. ఇలా కంక్వాంబా తన మొదటి ప్రయోగంలో 12 వాట్ల కరెంటును ఉత్పత్తి చేయగల్గాడు! అతను తయారు చేసిన విద్యుత్తు నాలుగు బల్బుల్ని వెలిగించటమే కాక ,

ఇరుగుపొరుగున ఉన్న రెండు రేడియోలని పలికించేది!



ఈ గాలిమర ప్రయోగం ఎందరినో ఆకర్షించి, క్రమంగా పత్రికల వాళ్ళని చేరింది. ఆ తరువాత క్రమంగా విలియంకి పేరు రావడం మొదలైంది. క్రమంగా అతను ఇలాంటి మరల్నే మరికొన్నిటిని తయారు చేసాడు. వాటిలో ఒక గాలిమర వ్యవసాయానికి నీళ్ళని కూడా తోడుతుంది!

అతని ప్రతిభను గుర్తించిన కొందరు అతను చదువుకునే ఏర్పాట్లు చేసారు. అలా స్కూలు చదువు పూర్తి చేసుకున్నాక, "ఆఫ్రికన్ లీడర్షిప్ అకాడెమీ"లో కొన్నాళ్ళు చదువుకుని, ఇప్పుడు పై చదువుల కోసం అమెరికాలో ఉన్నాడు కంక్వంబా. అలా సొంత ఊళ్ళో మొదలైన అతని ప్రయాణం ఇప్పుడు ఆగకుండా సాగిపోతోంది.




ఏడాది క్రితమే అతను వేరే పాత్రికేయుడొకరితో కలిసి తన కథను ఒక పుస్తకంగా రాసాడు: దాని పేరు - "The boy who harnessed the wind". ఈమధ్యే ఎవరో సినిమావాళ్ళు విలియం కంక్వంబా గురించి ఒక లఘు చిత్రం కూడా నిర్మించారు!

ఇంతకీ, ఇప్పుడు ఇతని గురించి రాయడం ఎందుకంటే- 'అసలు ఏలాంటి వసతులూ లేని ఆఫ్రికా కుగ్రామంలో పుట్టి, కరువు బారిన పడి, బడికి కూడా పోలేని పరిస్థితుల్లో చిక్కుకొని కూడా పట్టు వదలని విలియం కంక్వంబా తాను అనుకున్నది సాధించాడు కదా; మనం అతన్ని స్ఫూర్తిగా తీసుకుంటే బాగుంటుంది కదా!' అని.

మనం చదువుకునే విషయాలను బయట, ప్రపంచంలో, పదిమందికీ ఉపయోగపడేలా ఎలా ఉపయోగించాలో మనందరం ఆలోచించాలి, నిజంగా. 

# సమీక్ష

*గతమాసం విడుదలైన కొత్తపల్లి పత్రిక ఎలా ఉన్నది ? ఓ సమీక్షా వ్యాసం..*
*నిర్వహణ: శ్రీమతి మాలతీకృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*




"పిల్లలకు జాగ్రత్తగా నేర్పాలి, దగ్గరుండి. అప్పుడే వాళ్లకి ఏ పనైనా చేతనవుతుంది"- పెద్దవాళ్లకి తమ పెద్దరికాన్ని, ఇంపార్టెన్సును కాపాడుకోవటానికి ఈ భ్రమలో ఉండటం చాలా ఇష్టం. నిజానికి ఎవరో చెప్పినట్లు, 'నేర్పితేనే నేర్చుకునేట్లయితే పిల్లలకి అసలు ఏమీ చేతనవ్వకపోను'. పిల్లలు నడక నేర్చుకున్నంత సహజంగా, అలవోకగా మనం లెక్కపెట్టలేనన్ని పనులు చక్కగా చెయ్యటం ఇట్టే నేర్చుకుంటారన్నది అక్షర సత్యం. దానికి కావలసిందల్లా వాతావరణం, గడిగడికీ అడ్డుపడకుండా స్వేచ్ఛనివ్వటం. ఈసారి సంపాదకీయంలో చెప్పిన ఆటలు, ఆటలుగా కన్పించే పనులూ- చదువులు, టివి గొడవలో పడి చాలామంది పిల్లలు వీటి రుచైనా చూడలేకనే పెద్దవాళ్లైపోతున్నారని బాధేస్తుంది. పిల్లలు ఎన్ని సంతోషాల్ని పోగొట్టుకుంటున్నారో అని దిగులేస్తుంది.

ఈ సంచికలో పిల్లల కథలన్నిటిలోనూ వైవిధ్యం కానవచ్చింది.

* తనతో దెబ్బలాడిన కాకిని కోకిల కోపగించుకోకుండా ఎంత సులువుగా దాని అసూయని పోగొట్టింది?! అశ్విని కథ పెద్దలకి పాఠం చెప్పినట్లుంది.

* రామాపురంలోని ప్రజలలా ఉంటే ఏ రాజ్యానికీ రాజు అవసరం లేనే లేదు కదూ! 'అందరికోసం' చిన్న కథైనా ఎంతో మంచి సందేశాన్నిచ్చింది. ఇంతకీ ఆ రాజుకి ఎందుకో, ఎవరిపైనో, కోపం!?

* పిల్లల మంచి చెడులలోను, వ్యక్తిత్వ నిర్మాణంలోను టీచర్ల పాత్ర తగ్గిపోతున్న రోజుల్లో- మంచి టీచరు ఓ పిల్లాడి జీవితంలో ఎంతో మార్పు తేవచ్చని నమ్మాడు స్టీఫెన్. పాఠం చెప్పటం మినహా ఏం చెయ్యగలమని నిరాశలో ఉన్న టీచర్లందరికీ ఈ నమ్మకం ఓ ఆశాకిరణం, ఓ స్ఫూర్తి.

* 'ఎవరికీ చెప్పద్దు'- మేం చెప్పకపోతే కథ చివర్లో వినయ్ చెప్పిన జాగ్రత్త పిల్లలందరికీ చేరేదెలా? వినయ్‌ది ఇది స్వీయ అనుభవమో కాదోగానీ, పిల్లల అనుభవాలు కథలుగా రావటం బాగుంటుంది.

* సహజీవనం ఏ ఒక్కరి అవసరమో కాదనీ, అందరూ సంతోషంగా, క్షేమంగా ఉండాలంటూ ప్రతి ఒక్కరూ అందరినీ కలుపుకు పోవాలనీ చింతచెట్ల కథ చెప్తున్నట్లుంది. భూమ్మీదున్న ప్రతి మనిషీ గ్రహించాల్సిన సత్యాన్ని చెప్పేందుకు సతీష్ ఎంచుకున్న ఉదాహరణ- ఎంత చిన్నదైనా, సూటిగా, వాడిగా, ఇట్టే భావం అర్థమయ్యేలా ఉంది.

* అనురాగ్ వేసిన బొమ్మలు- చెప్పినట్లు లేకుండానే కథ చెప్పటం బావుంది. కథకి మాటలు అవసరం లేదు కదా! కానీ పాపం, చందన్‌కుమార్ ఎందుకు చిన్నబుచ్చుకున్నాడో, చివరికి?

* బొమ్మకు పిల్లలు వ్రాసిన కథలు ఎంపిక కావటం లేదో, మరి పిల్లలెవరూ వ్రాయటం లేదో? ఎక్కువమంది పిల్లలు వ్రాస్తే బావుండేదేమో.

* 'అన్నదమ్ముల ఆప్యాయత' సున్నితంగా మనసుని తాకింది. 'ఆకలి దప్పులు' జీవిత సత్యాన్ని చెప్పింది. దీనికి పిల్లల స్పందన ఎలా ఉంటుందో, మరి!?

* అట్టమీద స్ఫూర్తిదాతలైన గురువుల ఎంపిక బావుంది. ఇక వీరాంజనేయులికి ఎన్నిసార్లు అభినందనలు చెప్పాలి?

దసరా శలవల్లో దండిగా చదువుకోవడానికి బోల్డన్ని కథలకోసం ఎదురు చూస్తుంటాం. 

# పదరంగం-8

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ తెల్లకాగితంలో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-8 తోపాటు ప్రచురించగలం. నిర్వహణ: దేవి, కొత్తపల్లి బృందం.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | 4 |
| | | 5 | 6 | | |
| 7 | 8 | | 9 | | |
| | | | | | |
| 10 | | 11 | | 12 | |
| 12 | | 13 | | | |

**అడ్డం:**

1. ఏ చెట్టూ లేని చోట ఈ చెట్టే మహావృక్షం (3)

3. తిరగబడిన 'చిత్రం' (2)

5. అడ్డదిడ్డంగా 'ఆడు' (2)

7. గాలి 'దిశ' మారింది (2)

9. నిధులు భద్రపరచే చోటు (3)

10. ప్రారంభం (3)

13. కంటిని కాపాడేది (4)

**ఆధారాలు: నిలువు**

1. ___రుచి ఎరుగదు, నిద్ర సుఖమెరుగదు (3)

2. సైన్యం (2)

4. అడ్రస్ (4)

6. చివరి (3)

8. చక్కగా బరువులు మోసే ఈ జంతువు పేరుని తిట్టుగా కూడా వాడేస్తుంటారు (3)

10. రేపటి మొన్నకి నిన్న (2)

11. మొదలు లేని నాలుక (2)

12. వడ (2)

**పదరంగం-6 కి సరైన సమాధానం**

దీనికి చక్కగా సమాధానాలు వ్రాసి పంపించిన పిల్లలు:

1. నందన ఏ.యస్, 4 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.
2. అసంగానంద రెడ్డి, 4 వ తరగతి, అజంతా స్కూల్, నెల్లూరు.
3. జి.సత్యలక్ష్మి, 2 వ తరగతి, ఇంటి బడి, చెన్నేకొత్తపల్లి.
4. సి.హెచ్ ఆదిత్య, 4 వ తరగతి, గ్రామర్ స్కూల్, హైదరాబాదు,
5. బి.రిషిత, రవీంద్రభారతి, S.N. పురం, విజయవాడ.

# చీమపాట

*రచన, గానం: "కవికాకి" కే.శే.జైసీతారాం, కోగిర, అనంతపురంజిల్లా.*

చీమా, చీమా! వస్తావా? సినిమా కెళ్దాం వస్తావా?
పరీక్షలయ్యా, బాలయ్యా! బాగా చదువుకోవయ్యా!

పిచ్చుకా, పిచ్చుకా! వస్తావా? పిక్చర్‌కెళ్దాం వస్తావా?
పరీక్షలమ్మా, పాపమ్మా! బాగా చదువుకోవమ్మా!

చిలకా, చిలకా! వస్తావా? షికారుకెళ్దాం వస్తావా?
పరీక్షలర్రా, బాలలూ! బాగా చదువుకోండర్రా!

ఈ పాటల్ని ఎలా పాడుకోవాలో తెలీటం లేదా?
ఇంటర్నెట్లో వీటన్నిటినీ వినే వీలున్నది.
పాటల్ని డౌన్లోడు కూడా చేసుకోవచ్చు.
సందర్శించండి: http://kottapalli.in

# నగరానికి దూరంగా..

*రచన: శ్రీ సూరి కుమారస్వామి గారు, విజయవాడ.*

*గానం:* 9-10 *తరగతుల బాలలు, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

నగరానికి దూరంగా.. పల్లె వున్నది!
ఆ పల్లెటూరి గుండెల్లో పండగున్నది! (2)

చిట్టి మొగ్గ విచ్చినపుడు-
చేను విరగపండినపుడు
చక్కనైన పిట్టలన్నీ -
రెక్క విప్పి పాడినపుడు
పల్లెటూరి గుండెలో పండగున్నది.(2)

ఆలమంద ఉదయవేళ-
పాలధార కురియునపుడు
తోట చేల ఉన్న గున్న మావి-
తోరణాలు కట్టినపుడు
పల్లెటూరి గుండెలో పండగున్నది.(2)

కోదండ స్వామివారు కోవెలలో నిలచినపుడు
పొగమంచు అగరు వగరు-
పొదపొదపై ప్రాకినపుడు
పల్లెటూరి గుండెల్లో పండగున్నది. (2)

నగరానికి దూరంగా.. పల్లె వున్నది!
ఆ పల్లెటూరి గుండెల్లో పండగున్నది! (2)

**వెల:**

ప్రతి ఒక్కింటికి: 20 రూ.

12 పుస్తకాలకై చందా: 240 రూ.

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కౌంటు వివరాలు:
"Kottapalli Trust",
A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670

ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు

సంపాదకత్వం: నారాయణ

వెబ్సైటు, సమాచార సాంకేతికత: ఆనంద్

ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు

చిత్రాలు: వీరాంజి, అడవిరాముడు, రాము, వాసు, ప్రసాద్, వెంకట్,వినయ్, లక్ష్మి, .

చిలిపి ప్రశ్నలు: వివియస్ మూర్తి.

బొమ్మకు కథ: జి.లలిత, telugu4kids

సమీక్ష: వై.మాలతి. పదరంగం: దేవి

కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:**

కార్టూన్ల వివియస్ మూర్తి గారికి, ఋషివ్యాలీ స్కూల్లో ఏడవ తరగతి చదివే సాక్షి జోషికి, ప్రకృతి బడికి, విద్యార్థి సృజన కుటీరానికి, telugu4kidsవారికి, మాలతీ కృష్ణగార్లకి, రాధ రాజశేఖర్ గార్లకి, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

ఇంటర్నెట్‌లో http://kottapalli.in వద్ద కొత్తపల్లి పత్రికను చదవండి.

అందరు పిల్లల కోసం మీరూ కథలు రాసి పంపండి.

చందాదారులుగా చేరి నెల నెలా కొత్తపల్లిని పోస్టులో మీ ఇంటికి తెప్పించుకోండి.

మీ మిత్రుల తరపున చందాలు కట్టండి.

మీకిష్టమైన బడులకు, గ్రంథాలయాలకు కొత్తపల్లిని బహూకరించండి.

# ఏకీకరణం!

అనగా అనగా ఒక ఊరు.

ఆ ఊళ్ళో అందరూ **క** భాష మాట్లాడతారు. ప్రక్క ఊళ్ళోఅందరూ **చ** భాషమాట్లాడతారు.

కొందరు తెలివైన వాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాషకూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ గౌరవించేవాళ్ళు.

ఆ ఊరిప్రక్కన ఇంకోఊరుండేది. ఆ ఊళ్ళోఅందరూ **ట** భాషమాట్లాడేవాళ్ళు.

కొందరు తెలివైనవాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాషా మాట్లాడేవాళ్ళు; **ట** భాష కూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ ఇంకా చాలా గౌరవించేవాళ్ళు.

ఇట్లా ఒకదాని ప్రక్కన ఒకటి, వేరు వేరు భాషలు- **క** నుండి **అ** వరకూ- మాట్లాడుకుంటూ ఒక పధ్నాలుగు ఊళ్ళు ఉండేవి. పధ్నాలుగు భాషలూ వచ్చిన వాళ్ళకి అందరికంటే ఎక్కువ గౌరవం దొరికేది.

అయితే అవన్నీనేర్చుకునేసరికి వాళ్ళు పాపం, ముసలివాళ్ళు అయిపోయేవాళ్ళు!

వాళ్లంత తెలివైనవాళ్ళు కావాలని పధ్నాలుగు ఊళ్ళ జనాలూ వాళ్ళ పిల్లల్ని పోరటం మొదలు పెట్టారు. ఎంత వేగంగా చదివినా, మొత్తం పధ్నాలుగు భాషలూ వచ్చేసరికి ముసలివాళ్ళు అయిపోతారు కదా?! అందుకని ఆ పని ఎవ్వరికీ ఇష్టం లేకపోయింది.

చివరికి ఈ పధ్నాలుగు ఊళ్ళకీ అవతల ఉన్నవాడికెవరికో ఒక ఐడియా వచ్చింది:

వాడొక **ఇ** భాషని కనుక్కొని, దాన్ని ప్రచారం చేశాడు: "**ఇ** భాష చాలా సులభం. అది **క** భాష వాళ్లకీసరిపోతుంది, **అ** భాష వాళ్ళకీ సరిపోతుంది. ఎవరికి వాళ్ళు, వాళ్ల భాషతోపాటు **ఇ** భాషనేర్చుకుంటే సరి! "

అందరికీ ఆ పద్ధతి నచ్చింది. దాంతో ఏ ఊరివాళ్ళు ఆ ఊళ్ళో కూర్చొని, వాళ్ల భాష, దాంతోపాటు **ఇ** భాష నేర్చుకోవటం మొదలుపెట్టారు.

కొన్నాళ్లకు పధ్నాలుగు భాషలూ వచ్చినవాళ్ళంతా చచ్చిపోయారు. మెల్లగా 13 భాషలు వచ్చిన వాళ్ళూ పోయారు. 12 భాషల వాళ్ళూ పోయారు. అట్లా చివరికి రెండు భాషల వాళ్ళే మిగిలారు అంతటా.

కొంత కాలం గడిచిన తర్వాత కొందరు తెలివైన వాళ్ళు అనుకున్నారు- "రెండు రెండు భాషలు నేర్చుకోవటం కష్టంగా ఉంది, ఒక్క **ఇ** భాష ఉంటే చాలు గదా" అని!

ఆ విధంగా కొన్నేళ్ళ తర్వాత పధ్నాలుగు భాషలూ చచ్చిపోయాయి; ఒక్క **ఇ** భాషేమిగిలింది!!

పధ్నాలుగు ఊళ్ళకీ అవతల బంగళా కట్టుకొని కూర్చుని అందరికీ తన భాషను నేర్పిస్తున్న **ఇ** భాష వాడు అప్పుడు నవ్వుకున్నాడు, వీళ్లందరినీ చూసి.

మీకు తెలుసా, ఇలా ప్రపంచం మొత్తం మీద ఈ సరికి 2000 కి పైగా భాషలు చచ్చిపోయాయట, నిజంగా!!

Edited, typeset and Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in

మంచి పుస్తకం

# పాటల్లో పాఠాలు

ఐదారేళ్ల చిన్నారులకు అభినయం అంటేనూ, పాటలంటేనూ ఎంత ఇష్టమో! డా.నన్నపనేని మంగాదేవి గారు ఎన్నో సంవత్సరాల క్రితం బుజ్జాయిలకోసం రాసిన అభినయగీతాల మాలిక, ఈ "పాటల్లో పాఠాలు" అనే బుజ్జి పుస్తకం. 26 పేజీల ఈ సన్న పుస్తకంలో అమూల్యమైన పాటలు ఒకపదిహేను ఉన్నై. మచ్చుకి ఓ "పాప-పిల్లి":

(తలుపు మీద కొట్టిన శబ్దం...టక్-టక్-!)
తల్లి: పాపా!పాపా! చూడమ్మా!
ఎవరొచ్చారో చూడమ్మా!
(తలుపు తీసినట్లు అభినయిస్తూ)
పాప: పిల్లికూన ఇట ఉందమ్మా
గుర్ గుర్ మని అంటోందమ్మా!
పిల్లి: మ్యావ్-మ్యావ్-మ్యావ్!
తల్లి: చప్పున తలుపు వేసేయ్ తల్లీ
లేకుంటె పాలన్ని తాగేను పిల్లి!
పిల్లి: తలుపేయకే పాప! తలుపేయకు!
ఆకలితో నేను అలమటించేను!
మ్యావ్!మ్యావ్!మ్యావ్!

పాప: హుష్!
చప్పుడు చేయక కూర్చో పిల్లీ
అమ్మ లేకుండా వస్తా మళ్ళీ
నీకగు పాలు నే తెస్తాగా?
ఆకలి తీరగ పోస్తాగా?!
(పాప పాలు తెచ్చి పోస్తుంది.పిల్లి పాలు తాగేసి మూతి నాక్కుంటూ)
పిల్లి: మ్యావ్!మ్యావ్!మ్యావ్!
మంచి మనసు గల పాపాయీ!
రేపొకసారి వస్తానోయీ!
మ్యావ్! మ్యావ్! మ్యావ్!

**కష్టపడైనా దొరికించుకొని సజీవంగా నిలుపుకోవాల్సిన పుస్తకాల్లో ఇదొకటి!**

**పాటల్లో పాఠాలు (2001)**
రచన: డా.నన్నపనేని మంగాదేవి
ప్రచురణ: న్యూస్టూడెంట్ బుక్ సెంటర్,
అరండల్ పేట, మెయిన్ రోడ్,
గుంటూరు-522 002
పేజీలు 26, వెల:రాయలేదు

